ప్రథమముద్రణము

౫౦౦ ప్రతులు

ఖర సంవత్సర మాఘము.

శ్రీపతిముద్రాలయము

కాకినాడ

౧౯౫౨

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 22 | 7 | కుళుఁడోచు | కుశుఁడోచు |
| 97 | 5 | పిశసింపఁగ | మడియింపఁగ |

# శుద్ధాపరిశుద్ధపత్రిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| 1 | 10 | మానవున్ | మాదృశిన్ |
| 4 | 9 | పట్టన | పట్టణ |
| 14 | 13 | పతక | పడక |
| 15 | 16 | కిరీటముల్ | కిరీటమున్ |
| 27 | 21 | కంఠ్య | కంఠ |
| 30 | 9 | బహ్మణాది | బ్రాహ్మణాది |
| | 21 | అనిశరా | అనవరత |
| 35 | 6 | [illegible] | జాగ్ర |
| 39 | 5 | సీమాల | దేశము |
| | 17 | తేజోవంతుండు | తేజస్వంతుండు |
| 48 | 7 | తుంపంబు | తుండంబు |
| 51 | 16 | లస్తంద్ర | నిస్తంద్ర |
| 58 | 6 | గిరాట | గిరాళి |
| 61 | 10 | తాపసి | సంయమి |
| | 22 | బట్టి | బట్టు |
| 62 | 1 | గమి | దమి |
| 66 | 16 | తాపసిగందుకొని | తాపసుఁడుద్దవిడి |
| 74 | 10 | ఫణిశివరుసి | వసుమతీశు |
| | 21 | పుట్టిమ్ము | పుట్టమ్ము |
| 76 | 13 | గళా | గళ |

| | | | |
|---|---|---|---|
| 90 | 13 | తాపసియు | తాపసుండు |
| | 15 | ప్పైన | ప్పైసి |
| 92 | 16 | నిటుల | నిటులలు |
| 93 | 9 | మావిశాలు | మాతిశాలు |
| 94 | 8 | డిటుల | డిగాలు |
| 98 | 6 | యెడఁదఁదృప్తిన్ | యెడఁదతృప్తిఁ |
| 112 | 14 | నెడలన్ | నెలలన్ |
| 119 | 8 | కనూసవి | కునూతన |
| 120 | 14 | దాపసి | సంయమి |
| 132 | 14 | తవిరుల | తలిరుల |
| | 23 | దాపసి | దాపసు |
| 133 | 20 | నలసే | నెలసే |
| 144 | 24 | దాపసి | దాపసు. |

తురీయాశ్వాసమున 150 పద్యమున 3-4 పాదములు, "తద్విద్ధతిన్.........నామధేయమున్." అనునట్టివి మారుగ "తదీయవిక్రాంతివిరాజితేన్ భరతఖండమఖండనభూతలవాలమై." అనియు "అందున" యనియున్న తావుల "అందును" అనియు సవరించుకొనవలయును.



కృతికర్త

[illegible]

**కాకరపర్తి కృష్ణశాస్త్రి**

హరిహరదేవాయ నమః

# కౌశికాభ్యుదయము

## ప్రథమాశ్వాసము



శ్రీపద్మాయతలోచనుండు విబుధక్షేమంకరుం డార్తసం
తాపామూలసదాపనోదనవిధానస్థానచిత్తుండు మా
శ్రీపాదాన్వయుఁ గృష్ణమూర్తివిబుధున్ శ్రేయోనుసంధాయి స్థై
కాపాదుం గరుణాలవాలవరవీక్షాలక్షితుం జేయుచున్. 1

ఉ. ఉన్నతగోత్రసంభవత యున్నది లే కఠినత్వ మెట్లు నో
వున్నను పీడి యంచు సభవుండు హసించుచుఁ బల్క నార్యయున్
దిన్నఁగఁ దోఁచునే విషమదృష్టి కనం జెలిపల్క నొక్కుచున్
మన్నన సేయుశంకరుఁడు మాకృతినాయకుఁ బ్రోచుఁగావుతన్. 2

మ. పరిశీలించి సమానుఁ డంచుఁ గడు సంభావించి తౌల్యంబుగాఁ
బరమాయుర్గరిమారమున్ విధి కృతిస్వామిం గటాక్షించుతన్
బరకాంతావిముఖున్ ముఖస్థవిలసద్వాణీవిలాసైకసం
భరితున్ సారససంభవున్ బ్రకృతినిర్మాణప్రవీణాగ్రణిన్. 3

మ. తృణమే మేరువుగా గ్రహించి మది సంతృప్తిన్ గడించున్ సమ
ర్పణముం జేయ నసారమోదకమె సంభావించు నాగాస్యుఁ డీ
ప్రణతుల్ చేకొని మామకీనకృతినిర్మాణాంతరాయాళిమా
రణముం జేయక మానునే శివకుమారఖ్యాతిఁ గోల్పోవునే? 4

ఉ. అప్పులఁ దేలుఁ బంకజగృహం బని దానిఁ దృణీకరించి పెం
దప్పగ నెంచి నాయకునెదం బద మానుట మాని కోరికల్
చిప్పిల లచ్చి చంచలతఁ జిందరవందర సేసి నిల్చుతఱిన్
దప్పక మత్కృతీశ్వరసుధాధవళామలధామసీమలన్. 5

చ. శిరమున సమ్మతిన్ సవతిఁ జేర్చిన లాఘవవృత్తి నేర్చినన్
గురు నటు మెట్టినన్ రుచిరగోత్రునిఁ బట్టిన శాంత మానుశం
కరుసహధర్మచారిణి నికామముఁ గామితమంగళావళిన్
నిరతము మామకీనకృతినేతకుఁ బ్రీతి నొసంగుఁ గావుతన్. 6

మ. అనయంబు న్నినుఁ గొల్చి నీదుచనుబా లాకంఠముం ద్రావి మున్
ఘనకావ్యాళి రచించి మించి రఁట విఖ్యాతిన్ బురాసజ్జనుల్
తనుపం జెల్లదె నన్ను సారకవితాధారం బ్రసాదించి నా
జననీ! భారతి! మామకీనకృతి విస్తారోన్నతిం గాంచఁగన్. 7

కం. చేసెద వల్మీకజస
న్న్యాసికిఁ బ్రథమానసంస్కృతాదిమకవికిన్;
వ్యాసమునీశానునకున్
భాసమహాకవి కనూనవందనశతముల్. 8

మ. శ్రుతితాత్పర్యము ధీవిశేషకలనన్ శోధించుటే కాక; దు
ర్మతముల్ కూల్చుటె కాక; షణ్మతములం బాలించుటే కాక; త
చ్చతురాశాతటి నద్వితీయమఠముల్ స్థాపించుటే కాక; గ్రం
థతతిన్ జేసిన యాదిశంకరుల శ్రద్ధాభక్తి నర్చించెదన్. 9

మ. భవభూతిం బ్రణుతింతు, భారవిని సంభావింతు, భోజావనీ
ధవుఁ గీర్తింతు, మయూరు నెంతు, సుకవిన్ దండిం బ్రశంసింతు, హ
ర్షవిశేషజ్ఞుఁ దలంతు, బాణవిబుధున్ శ్లాఘింతు, మాఘున్ మహా
కవివిఖ్యాతునిఁ గాళిదాసుని నమస్కారాళిఁ బ్రీణించెదన్. 10

ఉ. వ్యాసమునీశచారుపరిభాషితభారతసంహితన్ యథే
చ్ఛాసమలీలఁ దెన్గునుడులందు రచించిన నన్నయాదులన్
దోసిలి యొగ్గి వేఁడెద నదోషమనోహరసారధోరణీ
భాసురసత్కవిత్వపరిపాకనిరంతరలాలసుండనై. 11

కం. వినుతింతున్ నాచనసో
ముని భీముని రామరాజభూషణు శ్రీనా
థుని చేమకూర వేంకన
ఘనుఁ బింగళిసూరనార్యుఁ గడుమోదమునన్. 12

మ. నతియింతున్ మతిఁ గృష్ణమూర్తివిలసన్నామాంకు శ్రీకృష్ణభా
రతనిర్మాణధురంధరున్ సుకవితారాజ్యప్రతిష్ఠాపకున్
క్షితిపాలాళిసమర్చితామలపదున్ శ్రీపాదసద్వంశ్యు మ
త్కృతినేతం గవిసార్వభౌము సువివేకున్ వేదపారంగతున్. 13

ఉ. అంకిలి లేక కాకవిఘటాపటుకేసరియై వధానహే
లాంకితుఁడై నృపాలకసభాంతరవీథివిహారియై యశో
లంకృతుఁడై యథేచ్ఛగ మెలంగెడు చెళ్లపిళాన్వవాయు మా
వేంకటశాస్త్రిసత్కవి నవేలకలాకలితున్ నుతించెదన్. 14

మ. పటుమేధానిధి నస్మదీయజనకున్ భాషాపరాహీశు ను
త్కటపాండిత్యవిశేషభూషితుఁ గృపాధారున్ సదాచారు వేం
కటరాయార్యు మదీయసద్గురుని లోకజ్ఞానధౌరేయు వి
స్ఫుటసద్భక్తి నతింతుఁ దన్మృదుపదాంభోజద్వయిన్ వ్రాలుచున్.

శా. భావశ్రీపరిపాకసంకలన హేవాకంబు సత్కల్పనా
ప్రావీణ్యంబు సురాపగాతులితధారాశుద్ధి యత్కావ్యమం
దావేశించునొ తత్కవీంద్రులను సాంద్రానందముం బొంది సం
భావింతున్ వినుతింతు నంతయు నమోవాకమ్ము లర్పించుచున్ 16

శా. ఛందోభంగము సంతరించి యతులం జక్కాడి యశ్లీలమున్
జిందం జేయుచు భాషఁ గూల్చుచు విసంధిన్ లీల సంధించుచున్
గ్రిందు న్సేఁయుచును గాన కాదికవులన్ నిందించుచున్ సంతతా
మందానందము సంసు ప్రస్తుతకవిమ్మన్యాళి గర్హించెదన్. 17

కం. ఏవంవైఖరి నసమత
దైవతనతి సుకవివినుతి దర్పితకుకవి
శావలినిరాకృతిన్ మతిఁ
గావించి వసించియున్న కాలమునందున్. 18

ఉ. రాజమహేంద్రపట్టనవిరాజితనైజనివాససౌధవి
భ్రాజితసత్సభాస్థలి నభంగురసంగతి వేదవేదుల
వ్యాజకవిత్వతత్త్వపరిపాకధురీణులు ముచ్చటింపఁగా
నోజ వసించి శ్రీపదసులోద్వహకృష్ణకవీంద్రుఁ డాదృతిన్. 19

సీ. కల్యాణకృదతుల్యతుల్యాపగాప్రాంత
ఘటితరామేశ్వరగ్రామవాసుఁ
గాకరపర్త్యపాఖ్యాకకాశ్యపసగో
త్రపవిత్రు నారామద్రవిడశాఖు
విమలవేంకాంబికావేంకటరాయనా
మకదంపతిప్రాథమికతనూజు
నాంధ్రగీర్వాణభాషానిర్మితానేక
మధురప్రబంధసంగ్రథితకీర్తి

తే. గీ. నాయురాగమశాస్త్రరహస్యవేది
సద్వయబ్రహ్మవిద్యావిహారరసికుఁ
బ్రస్ఫురత్కవికంఠీరవబిరుదాంకు
నన్ను రావించి మిపుల మన్ననలఁ దనిపి. 20

* మ. కృతి నిర్మించిన స్వీకరించిన నిలం గీర్తిం బ్రతిష్ఠించి స
ద్గతులం గాంతురటంచు వేదములు శాస్త్రంబుల్ వచింపన్ మహా
కృతులం జేసితిఁ బెక్కు లే నిపుడు లోకైకవేద్య మా నొక్కస
త్కృతి నొందంగఁ దలంపు సేసితి మదిం గిం చేనటం జెన్నమీన్.

* సీ. ఆశ పెద్ద దలంతి కైన నప్రతిహాత
మగుటఁ జెప్పెద విను మాకృతియును
సకలలక్షణలక్షితకథాకలిత ముత్త
మోత్తమనాయకాత్యున్నతమ్ము
సుప్రసిద్ధము నూత్నశోభాసమంచిత
మకలంకమృదులభాషాంచితంబు
సుకృతప్రదము సర్వసుకవిసమ్మతమును
సుజనైకవేద్యమై చొప్పడ నగుఁ

తే. గీ. గవియు సర్వసమర్థుఁడుఁ గావ్యశాస్త్ర
విద్వరిష్ఠుఁడు విప్రవంశోద్వహుండు
గ్రంథపరిశోధకుండు సద్గ్రంథకర్త
యయి ప్రసిద్ధిని గొనియుండ నగును గృతికి. 22

* ఉ. అట్టికృతిన్ గ్రహించుటకు నాస యొనర్చితి నెట్టిగ్రంథమో
యెట్టికవీశ్వరుండో లభియించుట యెట్టులో యటంచు నింతలో
నిట్టటుఁ ద్రిప్పి శేముషి ననేకవిధంబులఁ జర్చ చేసి య
ప్పట్టున సంశయార్థములపట్ల గ్రహించితి నిశ్చయార్థమున్. 23

* సీ. ఉభయభాషల నుత్తమోత్తమకవితఁ గూ
ర్పఁగలాఁడ వెన్నియో వరకృతులను
బొసరించితివి నీదుబుద్ధి దుష్పదముల
పొంతకుఁ బో దెంత లెంత లైనఁ

జనిపూవుఁ దేనెకు నెనవచ్చు నీకవి
త్వము కవిత్రయసమ్మతము మృదులము
లౌక్యవైదికముల నైక్యానుసంధాన
మున మహానందము నొనరఁ జేయు

తే. గీ. నాకుఁ జిరమిత్రమవు నీవు నాపయిఁ గడుఁ
గూర్మిఁ జేసినవాఁడవు కోవిదుఁడవు
శాంతచిత్తుఁడవును సర్వసమ్మతుఁడవు
ప్రణుతగుణకృష్ణ! కాకరపర్తికృష్ణ! 24

* చ. పరమపవిత్రవంశమునఁ బ్రస్తుతి కెక్కిన నిన్నుఁ గోరి నే
గరిమను నెక్క నొక్కకృతిఁ గైకొన నెంచితి నెంచ నెందఱో
వరకవు లిప్పు డొప్పుదురు వారలు నామది కెక్క రైరి నీ
చరితము తత్త్వసంగమున జ్ఞప్తికి రా బళి యంచు మెచ్చితిన్. 25

* కం. ధన మీయఁజాలఁ దృప్తిగ
మన మీయంగలను దాని మన్ననమీఱం
గొని నీ వొకసత్కృతి నే
ర్పొనరఁగ రచియించి నాకు నొసఁగుము సుకవీ! 26

* తే. గీ. కులగురుచరిత్రమును లోకగురుచరిత్ర
సలుపఁ దలఁ పగు నా కది సఫల మగునొ
కాదొ నీ విప్డు కులగురుఘనచరిత్ర
కృతి రచింపుము నాపేరఁ గృష్ణశాస్త్రి! 27

వ. అని యనేకప్రకారంబుల ననూనానురాగంబు గుబాళింపఁ బ్రశంసాపూర్వకాశాసనంబుల రవళించుచు, నవీనామూల్యదుకూలంబుల బహూకరించి విచికిలమల్లికామాలికావళీసమలంకృతు నొనరించి,

---

* ఈగుర్తుగల పద్యములు [illegible] కృతిభర్తచే రచితములు.

గంబు రాకమ్మతావుల గండూషించు చందనచర్చల సంభాళించి, కవిమూర్ధన్యబిరుదప్రదానపురస్కారమ్ముగ హిమవాలుకాకలికా కలితతాంబూలం బొసంగి సంభావించిన నాఁటిమధురగౌరవవిధానం బపరిమితానందసంధాయకం బగుటం జేసి చర్వితచర్వణంబుగా సంస్మరించుకొనుచు, రామాయణాదిమహాకావ్యాంతర్గతశతానందసానంద కథితగాధినందనచరితము ప్రధానాధారంబుగ నొకప్రబంధంబు సంస్కృజింప నుద్యోగించి తత్కావ్యమాణవకంబునకు నాయకమణిగాఁ గృతినాయకమణి పవిత్రవంశాభివర్ణన మొనరింప నుపక్రమించెద.

సీ. వెలనాటివా రిల వెల నాటినారు స
త్కవితకు గ్రంథసంతతి రచించి
వెలనాటివా రిల వెల నాటినారు శ్రౌ
తస్మార్తములకు నెంతయు వహించి
వెలనాటివా రిల వెల నాటినారు వి
హాయితంబునకుఁ దా మాచరించి
వెలనాటివా రిల వెల నాటినారు ది
వ్యాద్వైతమతమున కాకళించి

తే. గీ. అట్టివెలనాటివారిలో నమలగుణులు
శుద్ధతేజు లాపస్తంబసూత్రు లఖిల
వేదశాస్త్రప్రవీణులు విప్రమణులు
వైదికాచారపరులు శ్రీపాదవారు. 29

సీ. అలత్రిశంకుని దన్ప నజసృష్టి నతకరిం
చినసృష్టిఁ జేసినచేవకాఁడు
అలశునశ్శేపున కసుపంచకముఁ బ్రీతి
ధారవోసిన మహాధార్మికుండు

అలవసిష్ఠుఁడె బళీ ! యని మెచ్చ బ్రహ్మర్షి
తనె గడించిన మహోద్దండశక్తి
అలహరిశ్చంద్రు సత్యనిరూఢి సత మొప్ప
స్థాపించినట్టి పరోపకారి

తే. గీ. పనితసంశ్రితసుజనవాత్సల్యుండు
కౌశికుండు తపోధనాఖండలుండు
పరమపావన మైన శ్రీపాదవారి
గోత్రమున కాదిఋషి యయి కొమరుమిగిలె. 30

కం. శ్రౌతుల షట్ఛాస్త్రజ్ఞుల
జ్యౌతిషవిద్యాగ్రసరుల సంగీతకళా
చాతుర్యభారవాహుల
నాతతగతిఁ గన్న యామహాన్వయమందున్. 31

ఉ. విశ్వజనీనుఁ డై సకలవిద్యలకుం గని యై యశేషభూ
మీశ్వరపూజితుం డయి యహీనమఖాచరణప్రవీణుఁ డై
శాశ్వతసద్యశోనిభృతసర్వదిగంతరుఁ డై యెసంగె స
ర్వేశ్వరదీక్షితుండు విబుధేంద్రులకుం దలమానికంబుగన్. 32

మ. కనకోర్వీధర మీయఁగాఁ దివిరినం గైకొంటకుం జేయి సా
పనిసద్వైదికమూర్తి, యెంతటిమహోపాయంబునం దాడిత
ప్పనియార్యోత్తముఁ, డర్థిసన్నికరజీవంజీవచంద్రుం డనం
దనరెం దన్మఖి మందపాటిమహిపాస్థానోన్నతోద్యోగి యై. 33

మ. నయ మేపారఁగఁ దండ్రిచెంతనె ఘనాంతమ్మున్ యజుర్వేదమున్
జయనాంతమ్ముగ శ్రౌతమున్ నిశితదీక్షాలక్ష్య మై లీల న
ధ్యయనించెన్ సహజప్రయుక్త యయి యేయజ్ఞాంక్షి యాసద్గుణో
చ్చయపాథోనిధి పాపసోమిదమ తత్సర్వేశ్వరార్ధాంగి యై. 34

కం. రతి యై సుందరతఁ భా
రతి యై విద్యావిశేషరమఁ బండితస
న్నుత యై విరాజిలెఁ నిజ
పతిరాగాదరణనిరతభాజన మగుచున్. 35

చ. కరము స్వరాపరాధములఁ గాంచక దీక్షితసద్గురూత్తమో
చ్చరితఘనాంతవేదముల ఛాత్రసమూహము వల్లె వేయుచో
విరతియె లేక తద్రవము పెండెల వాసలఁ బట్టె నన్న నే
కరణిఁ గణించకుండెడి నగారసమంతరజంగమావళుల్. 36

ఉ. ఇష్టి నొనర్చువేళల నిజేశున కెయ్యది కర్మలోపమున్
స్పష్టము సేయ, నాగ్రహవశంబునఁ దాడన మాచరింపఁగా
దృష్టిని బూని వల్లభుఁ డతీతగతిం బ్రవహించురక్తముఁ
గష్టత గార్హపత్యమునఁ గల్గినభస్మముచేతఁ గప్పుచున్. 37

ఆ. వె. క్షమను జూపినట్టి సాధ్వీలలామను
బాపసోమిదమ్మఁ బ్రస్తుతించి
రచటివార లెల్ల నాగమధర్మని
ష్ణాత యనుచు వేదమాత యనును. 38

కం. నిర్మలమతి యై యతులిత
ధార్మికుఁ డై వేదకోవిదప్రవరుం డై
వర్మితసుగుణుఁడు వేంకట
శర్మాఖ్యుఁడు దనరె వారిసంతానం బై. 39

మ. వరపుత్రుల్ జనియించి రాతనికి సుబ్రహ్మణ్యసర్వేశ్వరుల్
నరసాంబాసతియందు నాసుతులలోనం బెద్ద దా సర్వదా
పరమేశాంఘ్రిసరోరుహార్చనకళావ్యాపారపారీణుఁ డై
తఱలించెం దనజీవయాత్రను బ్రశాన్తప్రాభవాభోగుఁ డై. 40

ఆ. వె. అప్రతిగ్రహీత యగు నామహాత్ముఁడు
కామమాంబయందుఁ గాంచె ముగుర
విమలధీవిశాలు వేంకటాధ్వరిని బూ
తాత్మ సుందరమను యజ్ఞమ నొగి. 41

సీ. సంస్కృతాంధ్రములం దసామాన్యగతి రస
వత్కవిత్వముఁ గూర్చుపండితుండు
కోటరామనరేంద్రుకొలువున మంత్రియై
లోకోపకృతి సల్పులౌకికుండు
నిష్ఠ దైవార నగ్నిష్టోమముఖమఖ
స్తోమమ్ము సలిపినసోమపాయి
యాదిశేషుఁడు సైత మాలకింప నతీత
రక్తి వెలార్చుపౌరాణికుండు

తే. గీ. శ్రౌతమున స్మార్తమందును శాస్త్రమందు
నాయురాగమమందును జ్యోతిషమునఁ
జేవఁ బ్రకటీకరించు మేధావిమౌళి
స్తుత్యగుణరాజి వేంకటసోమయాజి. 42

ఉ. అంకిలి లేక వైదికము నందును లౌకిక మందు నేరికిఁ
జంకక ధర్మహానికృతి సల్పఁగ జంకుచుఁ గీర్తిఁ బెంచు నా
వేంకటసోమయాజి పటువేదవిదన్వయరత్నసంభవన్
వేంకటసుబ్బసోమిదమఁ బెండిలి యాడె శుభోత్తరమ్ముగన్. 43

చ. పదుగుర సుబ్బసోమిదమ భాసురరూపులఁ గన్న దయ్యు వా
రెదుగకయే మృతిం గనుట నెంతయుఁ జింతిలి కార్శ్య మందఁగా
సదయుఁడు యోగి యొక్కఁడు భుజంగమపూజల సల్పఁ డంచుఁ దాఁ
బదపడి తార్క్ష్యవిగ్రహము వారి కొసంగె సమర్చనార్థమై. 44

కం. ఇరువురుకుమారశేఖరు
లిరువురు పుత్త్రికలుఁ గల్గి యిటఁబట్టి కడు
న్నిరపాయత జీవింతురు
చిరకాల మఁటంచు యోగి చెప్పఁగ వారల్. 45

ఉ. ఉరగముఁ బూజ సల్పి రలయోగినిదేశము మీఱకుండఁగన్
గరుడహయాధిరూఢుఁ డయి కంజదళాక్షుఁడు కృష్ణుఁ డానిశాం
తరమున వచ్చి స్వప్నమునఁ దప్పక గారుడకృష్ణనామముల్
పెరిమము మేరమీఱఁ బ్రభవించెడుసంతతి కుంపఁ బల్కెనన్. 46

సీ. ప్రథమతనూజాతవర్యునకున్ గరు
డాచలకృష్ణాఖ్య నలవరించి
యాపిమ్మటన్ గన్నయాఁడుబిడ్డకు గరు
డాచలకృష్ణవేణ్యాఖ్య నుంచి
యటుపయిసుతకు గంగాచలగరుడప
దాదికకృష్ణవేణ్యభిధ నుంచి
తరువాతివాని కెంతయు గరుడాచల
రామకృష్ణుం డనునామ ముంచి

తే. గీ. గారవము మీఱఁ బెంచిరి కడకుఁ గృష్ణు
పరమకరుణావిశేషసంపదలవలన
నిలిచియున్నట్టి సంతానవరులకు సుబ్బ
సోమిదమ్మయు వేంకటసోమయాజి. 47

ఉ. ఆదిమనందనుండు చతురాగమవిజ్జనతావతంసుఁ డా
సాదితశాస్త్రభారుఁ డయి శాస్త్రిపదోత్తరకృష్ణమూర్తినా
మేదిని సార్థకాహ్వయత మించి దిశాదశకాంతరంబునన్
మేదురకీర్తిచంద్రిక లమేయగతి న్నినిచెం గొరిం బొరిన్. 48

తే. గీ. బాల్యమందు నకారమ్ము పలుకలేక
పోయె సుధీవిశాలుఁ; డిప్పుడును నదియె
నోటఁ బట్టమి యర్థియెడాటమందుఁ
బొలిచె నవ్వాని కాజన్మభూషణముగ. 49

చ. కుతుకము మీఱ బాల్యమునఁ గోమలమంజులదేహకాంతిసం
తతి జనకాంకసీమఁ గడుఁ దార్కొనఁగాఁ బవళించి వ్యాసభా
రతకథ నాలకించె నవిరామగతిన్ బిత దెల్పఁ; గృష్ణభా
రతరచనైకబీజ మయి రాజిలె నయ్యది నేఁడు వీనికిన్. 50

చ. జనయిత చెంత సొంతముగ శ్రౌతము నేరిచెఁ; గావ్యపంచకం
బును వరశాబ్దనాటకసమూహ మలంకృతు లభ్యసించి తా
నెనసె నపారసాహితి నహీనగతిం దమి నాగలింగధీ
ధనికునికారణంబున సుధామధురమ్ముగఁ గైతఁ జెప్పుచున్. 51

తే. గీ. ఏకలవ్యుండు తొల్లి ధన్వీంద్రుఁ డయ్యె
ద్రోణు గురునిగఁ జిత్తమందును దలంచి
ఈమహాత్ముఁడు కవిసార్వభౌముఁ డయ్యె
నల్లశ్రీనాథు గురునిగా నాత్మఁ దలఁచి. 52

ఆ. వె. మాతులుండు శిష్యమండలికిన్ సంత
సంతరించు వేళ శ్రవణమాత్ర
పరిచయంబుచేతఁ బరిపూర్తిగా స్మార్త
మును గ్రహించెఁ గృష్ణమూర్తిశాస్త్రి. 53

ఉ. ఆతనిధీవిశాలతల నధ్యవసానము యోగిధర్మని
ష్ణాతత సాహసిక్యమును జాతురియున్ హరిదంతవిశ్రుత
ఖ్యాతియుఁ గాంచి బాలకత గాంచి సదావళి "పిట్ట కొంచెమున్
గూఁత ఘన" మ్మటంచుఁ బలుకుం దల లూఁపి ప్రశంస సేయుచున్.

ఆ. వె. ఆత్మజనకుసవనమందు నాధ్వర్యవ
మొనసెఁ బదియు నెన్మిదేండ్లలోనె
రమణ నాతఁడు "పితరం యాజయే త్పుత్ర"
యనెడు నార్యవచన మవధరించి. 55

చ. వినయవివేకసద్గుణపవిత్రను వేంకటరత్నమాంబికన్
దనసహధర్మిణిన్ నయనిధానను బ్రేముడి నేలి యామెయం
దున సుగుణాలవాలుల నదోషచరిత్రులఁ బుత్త్రికాయుగం
బును గనె దర్శనీయకళఁ బొల్చుకుమారు సుదర్శనాహ్వయున్. 56

తే. గీ. కనులయందు విశాలతఁ గాంచి ప్రథమ
తనయ కిడియె విశాలాక్షి యనెడు పేరు
పిమ్మటం గన్నసుతకు సావిత్రి యనెడు
నామధేయంబు గవిసార్వభౌముఁ డునిచె. 57

తే. గీ. ఆదిమతనూజ యగువిశాలాక్షి సుకవు
లక్కజము నంద గద్యపద్యాత్మకమ్ముఁ
గావ్యజాలమ్ము విరచించి ఖ్యాతిఁ గాంచెఁ
దండ్రిఁ బోలినపుత్త్రిక ధన్య గాన. 58

ఉ. ప్రాకటలీల నూటికిని పైఁబడుకబ్బములన్ రచించు టే
కాక వధానకార్యములె కాక మనోహరమైనచాటువుల్
కాక రచించె భారతముఁ గమ్మనితెన్గున ముద్దులొల్క నే
కాకిగ నాబుధుం డవతికాలమునం బటువార్ధకమ్మునన్. 59

ఉ. "హా" యని గ్రామ్యనవ్యకవితారభటిం గని వెక్కి వెక్కి కం
దోయి దొరంగునశ్రువులతోడ సళించెడునాంధ్రవాణి న
త్యాయతభక్తిఁ గృష్ణకవి యారసి పాపెను కంటినీరు వ
జ్రాయుధపుత్త్రికామలపటాంచలకల్పితమార్జనక్రియన్. 60

సీ. ఎంతయార్జించిన నంతవ్యయమె కాని
మూటఁ గట్టెదుకోర్కి మొదలె లేదు
కఠినారిపైనైన క్షణకోపమే కాని
శాశ్వతదండనాశయము లేదు
తప్పుగన్గొన్నచో విప్పిచెప్పుటె కాని
మాటలలోన మోమోట లేదు
సరసకవిత్వ మాస్వాదించుటే కాని
యరసి వీఁ డెంతనునదటు లేదు

తే. గీ. అంతనిష్కామ్య మంతంతయార్జవమ్ము
నంతయౌదార్య మంతంతయాదరణము
నింతవిద్యాతిరేకత యెసఁగుచోట
నరయనౌనె యీయొక్కనియందకాక. 61

సీ. "కవిరాజ"బిరుదంబు గాంగేయపతక మ
ప్పనము సేసె మయూరభంజిపురము
"గండపెండేరము" డాకాలికిఁ దొడిగించె
నెంతయు రాజమహేంద్రవరము
"స్వర్ణాభిషేకమ్ము" సలుపుచుఁ "గవిసార్వ
భౌముఁ" డనుబిరు దిడెఁ బాలకొల్లు
లలిమీఱ నొసఁగెఁ "గళాప్రపూర్ణుం" డను
పట్టంబును విశాఖపట్టణంబు

ఆ. వె. అమితభక్తి నిడె "మహామహోపాధ్యాయుఁ"
డనెడు గొప్పబిరుదు హస్తిపురము
ఇచ్చెఁ గాకినాడ యెఱిఁగి "యాంధ్రవ్యాస"
బిరుద మార! కృష్ణవిబుధమణికి. 62

ఉ. వ్యాసముఖోక్తభారతము నాశుగతిన్ లిఖియింపఁజాల శా
యాసము నందె విఘ్నపతి యర్ణకథ నిక్కమె యైన వానికిన్
వేసట గల్గనీక, పటువేగముగా విలిఖించు నేర్పు చే
భాసిలు కృష్ణమూర్తి యలవ్యాసుఁడె వేసట నంద వ్రాసెడిన్. 63

తే. గీ. సకలసుకవీంద్రజయజయస్వాన మీను
విజయవాడ సాలూరుపూర్వఘులందు
వరగజారోహణమహోత్సవము లెసంగె
విశ్వకవినాథునకు మత్కృతీశ్వరునకు. 64

ఉ. చూపరు లద్భుతంబు గొనుచున్ దరిసింపఁగఁ బత్కలింపఁగా
నోపక రాణ్మహేంద్రనగరోన్నతచిత్రవిచిత్రవస్తుశా
లాపురతోఁ ఉవనిన్ గవిలలామశిలాప్రతిమావరేణ్యమున్
స్థాపనముం బొనర్చెఁ బురసత్పరిపాలకసంఘ మున్నతిన్. 65

ఉ. పౌరులు లౌకికుల్ విజయవాడపురీపరిపాలనక్రియా
సారమతుల్ కవీశ్వరులు శాస్త్రవిదుల్ గణనీయులౌ నదీ
శారులు వేదవేదులు సుఖస్థితి నెంతయు నోలగింపఁగా
ధారణ మాచరించెఁ గవిధాతసువర్ణమణీకిరీటముల్. 66

సీ. చేమోడ్పు "లభినవశ్రీనాథు"నకుఁ "గవి
సార్వభౌము"నకు నంజలిశతమ్ము
ప్రణతి "మహామహోపాధ్యాయు"నకుఁ "గవి
బ్రహ్మ"కుఁ బటునమోవాకకోటి
నతిసహస్రంబు "లాంధ్రవ్యాసు"నకు మహా
"కవిరాజు"నకు నమస్కారవిధులు
వందనంబు "ప్రసన్నవాల్మీకి"కిఁ "గళా
ప్రపూర్ణు"నకున్ భక్తిపూర్వవినతి

ఆ. వె. "విశ్వకవి"కి మ్రొక్కు "వేదవిద్యావిశా
రద"నకుఁ బ్రణామరాజి యనెడు
దర్శనార్థసంగతకవీంద్రరవముచే
తఁ బ్రతిధ్వనించుఁ దద్గృహంబు. 67

శా. ప్రాజ్యానర్ఘళసద్యశోగరిమ మీఱన్ జెన్నరాష్ట్రప్రజా
రాజ్యాస్థానకవీంద్రదివ్యపదవిభ్రాజిష్ణుఁడై విజ్ఞసం
పూజ్యుండై కవిసార్వభౌముఁ డనయమ్మున్ భారతీమైకసా
మ్రాజ్యం బేలెడు మాంకృతీశ్వరుఁ డసామాన్యుండు మాన్యుం డిలన్.

సీ. వెలయించె మధుకరవిజయప్రబంధమ్ము
నవ్యకేవలకల్పన మ్మొనర్చి
యలరించె నైషధీయచరిత్రము విచిత్ర
వర్ణనానేకగుంఫనము సలిపి
రచియించె శ్రీకృష్ణరామాయణంబును
వాల్మీకికవితకు వన్నె వెట్టి
పరిఢవించెను గృష్ణభాగవతంబు సా
త్త్వతేయభావంబు నాకళించి
గీ. ప్రౌఢగతి భారతమ్ముతోఁ బాటు నూట
యేఁబదికి మించు వివిధసత్కృతుల నతుల
గతుల విరచించె మామకకావ్యవిభుఁడు
కీర్తిసాంద్రుండు శ్రీపాదకృష్ణబుధుఁడు. 69

ఉ. బంగరుపూజ లందె, మణిభద్రకిరీటము దాల్చెఁ, గొమ్ము టే
నుంగుల నెక్కి యుత్సవవినోదములం గనె, గండపెండెరం
బుం గొనె, నెల్లమేల్బిరుదముల్ నడపెన్, యశముల్ దిశాతటీ
సంగతముం బొనర్చె నృపసత్కృతమత్కృతినేత గొప్పకుఁడే. 70

ఉ. ఎందఱు లేరు సత్కవు లహీనకళాంచితు లాంధ్రభూమిలో
నందఱి మాని నాదుకృతి నందుకొనెన్ గవిసార్వభౌముఁ డా
నందము మీఱఁ; మత్కృతి ఘనమ్మొ మదీయపురాభవక్రియా
మందఫలమ్మొ లేక లసమానతదీయదయాస్వభావమో ! 71

షష్ఠ్యంతములు

కం. ఏవంవిధప్రసిద్ధగు
ణావాసునకున్ మనోహరాకారునకున్
గేవలవిజ్ఞానికిఁ బర
భావిన్యతిదూరునకుఁ గృపాజలనిధికిన్. 72

కం. శతసంఖ్యాధికకృతిసం
తతినిర్మితిజనితకీర్తిధవళితహరిదం
తతతికి జితతచ్ఛతధృతి
నుతమతికి నసజ్జనాపనోదనరతికిన్. 73

కం. అక్షీణవాదకలనా
శిక్షితకాకవినికాయసిద్ధాంతునకున్
దక్షున కనారతప్ర
త్యక్షీకృతభారతీసుమాంగీకునకున్. 74

కం. కవిసార్వభౌమునకు సం
స్తవనీయచరిత్రునకు విశాలమనోభా
వవిలాసున కగ్రాంధిక
కవితానిర్మాలనప్రకల్పితధృతికిన్. 75

కం. వాసితకవితాప్రీణిత
భాసురకవిజాలభూమిపాలున కాంధ్ర

వ్యాసునకుఁ బిత్రుకృతయా
గాసాదితసుజనతానుతాధ్వర్యునకున్. 76

కం. సాదరమానసునకు శ్రీ
పాదావనిదైవతాన్వవాయభవునకుఁ
వైదికధర్మస్థాపన
వాదికి మాకృష్ణమూర్తిపండితమణికిన్. 77

వ. అభ్యుదయపరంపరాభివృద్ధియు, నాయురారోగ్యభోగైశ్వర్యసమృద్ధియు, హారిదంతదంతురితవిశదయశోవిలాసవిశేషప్రసిద్ధియు నగునటులు నాయొనర్పం బూనిన కాశీకాభ్యుదయం బనుమహాప్రబంధమ్మునకుం గథాసంవిధానం బెట్టి దనిన— 78

## కథాప్రారంభము

మ. సవరక్షఁ సవరించి లక్ష్మణుని విశ్వామిత్రునిం గూడి రాఘవుఁ డాతావుఁ గ్రమించి మించి జనకక్ష్మాజాసియూస్థానిఁ జొచ్చి విశేషాదర మారగించుతఱి వాచించెఁ శతానందుఁ డాదివిజాలీకలగీయమానఘనగాధేయైకగాథావలిన్. 79

శా. శ్రీకాంతావరణీయధామ మయి రాశీభూతశోభాదిదృక్షాకేంద్రీకృతనైజలోచనసహస్రస్థాపితాసూయితా
వ్యాకీర్ణామరలోకనాయకము నై ఖ్యాతిఁ మిటారించు కన్యాకుబ్జాహ్వయరాజధాని మహితార్యావర్తదేశంబునన్. 80

ఉ. ఆనగరాగ్రహర్మ్యములయందున వెన్నెలరేల మందమందానిల మాన లీల నడయాడుపడంతులసోయగమ్ములఁ
గాన విమానయానులయి నాకవిటుల్ చవిఁ గొంద్రు వాతభూతానుపమాన కేతనపటాగ్రచపేటపటుప్రహారముల్. 81

చ. హరిచతురాననుల్ విఫలు లైరఁట క్రిందకు మీఁది కేగి శం
కరుపదముల్ కపర్దమును గాంచఁగ లేక; మదీయశక్తిస
ద్గరిమఁ బరీక్ష సేయుఁ డని గంగయు భూమియు మేను వెంచె నాఁ
గర మవనీశసౌధపరిఖావరణంబులు వొల్చు నప్పురిన్. 82

ఉ. ఉక్కఁగ నుంటచేఁ దెఱచియుంచినసోరణగండ్ల వేసవిన్
జక్కఁగ నేగు నైశమ నిశాపతి; శీతలవేళఁ దల్పులన్
మిక్కిలి మూయ నేగుఁ బురిమేడల నల్లనఁ బ్రాఁకి; కానిచో
నెక్కువతక్కువల్ పడయ నేల ? తదీయనిశాప్రమాణముల్. 83

సీ. వెంపరలాడక విరులతావుల వింగ
డించుచుఁ బడకింట్ల నించు టొకటి
చాల పైసరముల నోలాకుపడినవా
రిని బునారతికిఁ బ్రేరేచు టొకటి
యలసి నాథునురంబునందు మ్రాఁగను వ్రాలు
పడఁతులచెమ్మటల్ దుడుచు టొకటి
కడుఁ బొలయల్కచే నెడమోము పెడమోము
సేయుజంటకు సంధి సేయు టొకటి

తే. గీ. ధీరమలయధరాధర-ధారసార
సారపాటీరగంధఘుస్మరసమీర
వారవిస్తారకార్యముల్ ప్రతినిశావ
సరములందున నప్పురీవరమునందు. 84

తే. గీ. రాజధాని నెసంగు కారాగృహంబు
లారెకులు వధ్యశిలలును న్యాయసభలు
బహుళశిక్షాస్మృతుల్ సార్వభౌమలక్ష
ణార్థమే కాని యుపయోగ మచట లేదు. 85

ఉ. నాలుగు వేదముల్ చదువ నాలుఁగు మోము లవేల? యొక్కఁడే
చాలదె? యాలిపల్కులఁ దుచల్ విడనాడక బమ్మ పల్కుచుం
గ్రాలఁగ నేల? వేదము ముఖస్థము గాక హరించి రంచు బొం
కేల? యఁటంచు నవ్వుదు రహీనకళాఢ్యులు తత్పురీద్విజుల్. 86

సీ. రాజరాజొకఁడు వైశ్రవణుండు పితృవనే
చరసఖహరాళి కిన్నరవరుండు
రాజేంద్రుఁ డొకఁడు గోత్రధ్వంసి యసితమా
తంగసంగుఁడు సురాదరణశాలి
రాజేందుఁ డొకఁ డవారణకలంకి బహులా
ర్తికృశాంగకుఁడు విపరీతవర్తి
రాజహరాళి యొకం డరాతినరాభిన్న
మస్తకమధ్యుఁ డంబాధవుండు

తే. గీ. ధనదుఁ డగుఁగాక వజ్రి యై తనరుఁగాక
పటుకళానిధి యగుత సర్వజ్ఞుఁ డగుత
గుణరహిత మైనరాజాఖ్యఁ గొనఁగ నేల?
యనుచుఁ గ్రేడింతు రచటిరాజాగ్రసరులు. 87

మ. మివులన్ రాజు ధనాంధుఁ డైనకతనన్ మేటిల్లుఁ దాఁ జారచ
క్షువుగా, యక్షుఁడు రాజరాజగుటచే జోడయ్యెఁ బైపెచ్చు వై
శ్రవణత్వంబు; నిధుల్ విధించె భువి నిర్వ్యాపారుఁ డై దాన; మా
నవతా యాతఁ డఁటంచుఁ బల్కుదురు వైశ్యాగ్రామణుల్ తత్పురిన్.

మ. బలరాముం డయి యుండ నౌను హలముం బట్టంగ నౌ నంతలో
ఫల మేమీ? యిలలోఁ గృషీవలులత్రోవం బోవఁగా శక్యమే
కలలో నైనను క్షత్రియుండు పురి గంగం గల్పుటో సూతు నౌ
దల్పై మోఁదుటో కాక యంచు నగు శూద్రస్తోమ మవ్వీటిలోన్.

సీ. రంభావిశేషసంరంభసంభారంబు
కలితనైజోరుయుగ్మమ్మునందుఁ
గమనీయసుశశిరేఖాదీప్తి నసమాన
లసమాననైజఫాలమ్మునందు
నుతతత్తిలోత్తమాతతమంజిమాభోగ
మును నైజనాసికాపుటమునందు
నిపమమానాకీర్ణహరిణీవిలాసంబుఁ
జంచలనైజలోచనములందు

తే. గీ. హారిపేఁమోహశోభ నైజాంగమందు
సాళగింపఁగఁ దా నేకకాలమందె
నాకగణికోపభోగ మీలోకమందె
యమ్మకము సేయు నచటివేశ్యాజనమ్ము. 90

సీ. ఈతమ్మిమొగ్గజో డెంత కిచ్చెద వంచుఁ
బొగరుగుబ్బలఁ జూపు పోహళించి
ఈక్రొత్తగొజ్జంగు లెంత కమ్ముదు వంచుఁ
దళుకుఁజెక్కులఁ జూడ్కి గిలకరించి
ఈజగామంకెన యెంత సేయు నఁటంచుఁ
గమ్మవాతెఱ దృష్టి గ్రుమ్మరించి
ఈపొన్ననెఱివిరి యెంతగా వెల యంచుఁ
గులుకుఁబొక్కిలి దృశల్ గుస్తరించి

తే. గీ. కళవళించుచుఁ బూలయంగళ్లమోలఁ
దట్టుముట్టాడుపడుచులఁ దటమటించు
రించువాల్చూపుల న్నివాళించి విరుల
విలువ రెట్టించి పుష్పలావికలు వీట. 91

మ. అనుకంపాపదమే యకర్ణపలితం బై యొప్పెఁ దచ్చంద్రహా
సనికాయమ్మునకుం దదీయతతపశ్చాద్భాగమున్ వైరి గాం
చనలే దెన్నఁడుఁ దన్నిఘంటువున భీశబ్దంబె లే దాపురీ
ఘనపాదాలికశక్తియుక్తిఁ బలుకంగా భామయే లే దిఁకన్. 92

సీ. బలశాలి యగు ప్రజాపతి మహాధృతి కృపా
తతమతి యెవ్వాని తాతతాత
అభియాతిదంతావళాసమాంకుశుఁ డౌచుఁ
దగుకుశుం డెవ్వాని తాతతండ్రి
విశదతేజోనిరంకుశుఁ డై పురాయించు
కుశనాభుఁ డెవ్వానిగురునితండ్రి
తతయశోధవళితదశదిశావీథి యా
గాధిరా జెవ్వానిఁ గన్నతండ్రి

ఆ. వె. యాతఁ డాతతానతారి విశ్వామిత్ర
నామధారి విమలధామభూరి
దానవారిదీనదీనార్థితాపాప
హారి యగుచు నేలు నాపురమ్ము. 93

సీ. క్ష్మాభృద్బలిష్ఠపక్షచ్ఛేదనక్రియో
ద్దండుఁ డై యుంట జిష్ణుం డతండు
వరసర్వమంగళాకరదివ్యధాముఁ డై
గ్రాలుటచే రాజమౌళి యతఁడు
శ్రీకలాపాంగమాలాకలాపావాప్తి
మొనయుటం బురుషోత్తముఁడె యతండు
ప్రౌఢపేశలసారభారతీకాంతుఁ డై
నెగడుటచేఁ బ్రజానేత యతఁడు

తే. గీ. హూయురే! బాపురే! బళిరే! యయారె!
యనుచు మానవలోకమందుననె కాక
స్వర్గకైలాసవైకుంఠసత్యములను
విబుధు లగ్గింత్రు కాశికోర్వీకళత్రు. 94

తే. గీ. తన్నృపాలునికరవాలధారచేత
వైరిశుద్ధాంతకాంతాశ్రుధార కెరలె
నాతనిప్రశాంతపాలననీతిచేత
భీతి పాతరలాడఁగా నీతి తరలె. 95

మ. పరనారీకుచహారహారమణుల్ ప్రస్ఫారనిశ్వాససం
జ్వరసంపర్కముచేతఁ బ్రేలిపడె పంచారించి గాధేయభూ
వరసారాతనువీరభావకలనాప్రస్యందిచిత్రేక్షణో
త్తరకాలంబుననే నిరాశ లెద హార్తర్ బ్రీతిచే భీతిచే. 96

మ. సకలోర్వీభర మీక్రియన్ నిజభుజాస్కంధంబునం దూని కా
శికభూకాంతుఁ డహీనలీలఁ బ్రజ జేజే వెట్ట సామ్రాజ్య మ
త్యకలంకానుపమానభద్రగతి న్యాయాలంబియై యేబుచో
నొకనాఁ డాతఁ డశేషదిగ్విజయయాత్రోత్సాహ మేపారఁగన్. 97

చ. ఒకత్రుటికాలముం దడయ నోడి యమాత్యులఁ బిల్వ నంచి కో
రిక వివరించి లౌకికపరిస్థితులం దిలకించి సంచితా
ర్థికగతి నెంచి నైజబలరీతి గణించి జిగీష యానువం
శికము ఫలప్రదం బని యశేషసభాసదు లుగ్గడింపఁగన్. 98

మ. వరకార్తాంతికలోకశేఖరుల నాహ్వానించి మన్నించి త
చ్ఛరదానిర్మలవేళలందె జయ మాసాదింపఁగాఁ జాలు ని
ర్భరశౌర్యప్రదసన్ముహూర్తమును నిర్ధారింపఁగాఁ జేసి చ
చ్చెర భేరీహతి రాజ్యసీమఁ బ్రచురించెన్ దండయాత్రావిధిన్. 99

శా. ఏనాఁడో పరిపంథికోష్ణరుధిరం బేపారఁగాఁ ద్రావి కో
శానూనైకశయానమం దొరఁగి భుక్తాయాసముల్ వాయఁగా
సానందంబుగ గుఱ్ఱు వెట్టి సుఖనిద్రాప్తిం బ్రవర్తిల్ల భే
రీనాదంబు సుషుప్తిభంగమును సారించెం గృపాణాళికిన్. 100

ఉ. వైరిమహోగ్రదుర్గకవాటవిపాటనపాటవార్థమై
వారణయూథకుంభములపైన నయఃఫలకప్రకాండముల్
గూరిచి కట్టి రాస్తరణకోటి ఘటించిరి మూఁపులందు నా
ధోరణు లంకుశాగ్రములు దూఁకొనఁగా వినిశాతతత్త్వముల్. 101

కం. నారుల వీడెడుతఱి చే
కూరెన్ రాజాజ్ఞ నైనఁ గోదండములన్
నారుల సంధించియె చను
వార మనుచు నగుచు సతులఁ బల్కిరి వీరుల్. 102

సీ. రథికలోకాంకముల్ రవణింప సిడెముల
నరదంబులకుఁ బైన నలవరించి
కటుకుఠారప్రాసకౌక్షేయకాద్యాయు
ధములకుఁ గ్రొర్వపాళములఁ గఱపి
క్రొంగ్రొత్తగరులచేఁ గొప్పరించుశరంబు
లురుతూణములఁ బొట్ట లుబుక నినిచి
కవచతోమరపరిఘాతనఫలములం
దున నత్తమిల్లు లేఁద్రుప్పు డుల్చి
తే. గీ. కర్మకరులెల్లఁ దమకుఱఁగలి వసించు
నధికృతులమన్ననలపెంపు నందుకొనఁగ
నుల్లముల గబ్బి యుబ్బి పింపిళ్లుగూయ
నేఁటిపనిఁ జేసినా రొక్కపూఁటలోన. 103

ఉ. గాధినృపాలపాలనము గ్రాలినకాలమునందు భీకరా
యోధనమందు నాత్మరచితోన్నతసంగరరంగనైపుణీ
గాథలఁ బుండలించిరి ప్రకల్పితగర్వవికస్వరాక్షులై
యోధవరేణ్యవృద్ధజను లూఁకొనుచున్ యువకుల్ హసింపఁగన్.

కం. ఈరీతి సర్వసన్న
ద్ధారూఢి రహింప జైత్రయాత్రాద్ధ్వని
ద్ధారితకాలము డాసెన్
వైరిప్రాణాంతకాలవైఖరి నంతన్. 105

శా. సేనానీఘటితాదిమానతిగతిన్ శీలించి ప్రస్థానభే
రీనాదం బురుభీకరక్రియఁ బచారింపంబడెన్ దద్ప్ర
యానల్పధ్వని మాఱుమ్రోఁగి దిశలం దస్తంగతం బందకే
సేనాసాగర మాక్రమించుచుఁ గ్రమించెన్ విక్రమానక్రమై. 106

ఉ. లీలఁ దుఱంగలింప నవలేపము లేపునఁ గ్రేళ్లు దాఁటు వా
సాలఁ గరం బొకండును నిశాతకృపాణకకోశసీమలం
గే లపర మ్మమర్చి తనుకీలితకంకటముల్ క్వణింప ను
త్తాలసమాంతరాంచితపదన్యసనంబులు తాళగింపఁగన్. 107

మ. శ్రవణంబుల్ నిజవాహినీపతిమహాజ్ఞాపాళి కర్పించి నై
జవిశాలేక్షణమాలికావళి దిదృక్షాద్వారసంగాంగనా
స్తవనీయామలకోమలాంగములకుం జందోయికిన్ భీరుతా
స్రవదిందీవరసుందరాక్షులకు ధారాదత్తముం జేయుచున్. 108

కం. అరుణోదయసమయమ్మునఁ
బురఘంటాపథమునందుఁ బురుహూతదిశన్
గుఱి సేయుచుఁ బాదాతము
లరిగెం బంక్తులను దీర్చి యహమహమికతోన్. 109

తే. గీ. ప్రళయకాలాంబరాలోలభయదకాల
పుష్కలావర్తజలదవిస్ఫూర్తిఁ బుష్క
లముగ నావిష్కరించుచు లలితగతులు
మెండుకొనినట్టికాటుకకొండ లనఁగ. 110

శా. అంకాపాంకము లంకరింప గళఘంటాభీలనాదంబుతో
ఘీంకారధ్వని సాళగింప మహీ ద్రాఘిష్ఠాత్మదానాంబుధా
రాంకాలంకృత మై రహింపఁ జనె మత్తానేకపంబుల్ నిరా
తంకప్రక్రియ భూతలం బద్రువగాఁ దద్రాజమార్గంబునన్. 111

తే. గీ. క్రాంతిశబ్దదపీయక్రిశాప్రయోగ
ములకు నావశ్యకత సుంత గలుగనీక
పల్లములకిఱ్ఱుసవ్వడి మల్లడింప
ఖరతరఖలీనములఁ బంటఁ గొఱుకుకొనుచు. 112

చ. ఖురపుటఘట్టనధ్వనులకుం బ్రతిరావము లాదిశాతటో
దరములనుండి వెల్వడ ముదంబు మదంబు సెలంగ వాలచా
మరముల వీచి రౌతులశ్రమంబుల నూడనిబాడఁ జేయుచుం
దరలె నభంగభంగగతిఁ దామరతంపరగాఁ దురంగముల్. 113

శా. సాంహోదారవనాయుజోత్తమతమూజానేయసన్నద్ధ మై
యారాజద్రథిసారథిప్రచురశస్త్రానేకబృందిష్ఠ మై
హేలాళోన్నతి మై శతాంగవిసరం బేగెన్ జవహ్లాయూఢి పాం
గారం దుంగసుమేరుశృంగములశృంగారంబు భంగించుచున్. 114

ఆ. వె. బహువిధాప్రమత్తపత్తిగోపాయిత
పటకుటీరభోజ్యవరపదార్థ
భరితశకటభారవహమహానడ్వాహ
ఖరమహోష్ట్రపంక్తు లరిగెఁ బిదప. 115

శా. ప్రాతఃకాలమునం దమందగతి విశ్వామిత్రభూనేత సు
స్నాతుం డై విధు లెల్లఁ దీర్చి తముఁ బ్రస్థానోచితాశేషవే
షాతంద్రస్ఫుటితప్రతాపపటుపేలారంభసంభారుఁ డై
చేతోమోదము లావరింప ద్విజు లాశీర్వాదముల్ నింపఁగన్. 116

ఉ. లాజలుఁ బూలు నక్షత లలంతిగఁ జల్లుచుఁ గప్పురంపుఁబీ
రాజన మెత్తి వృద్ధత విరాజిలుపుణ్యకుటుంబినీమణుల్
రాజతవేత్రహస్తులు బరాబరికల్ పఠియింప వందు ల
వ్యాజనిజప్రతాపవిభవాతిశయంబుల మూఁదలింపఁగన్. 117

చ. సుకవికదంబకారచితశోభితగాయనగాయనీమణీ
నికరసుగీయమానపరినిస్తులవీరరసప్రధానకీ
ర్తికలను జిత్తగించి గణుతించుచుఁ జేయుకొనెన్ హజారమున్
వికచసితాతపత్రపరివేషరుచుల్ పొరయం గిరీటమున్. 118

తే. గీ. సకలసామంతభూపధీసచివగణము
పార్శ్వయుగళంబునన్ వెన్కఁ బలిసి నడువ
మత్తకరిభంగి నత్తావు నుత్తరించి
చనియెఁ గైదండ నొక్కరాజన్యుఁ డొసఁగ. 119

చ. సిరు లురళింప నిట్లు కలిచిత్పదముల్ సని గాధినందనుం
డరమర లేనిలీల భవనాంగణసంగతభద్రసామజో
పరితల మాక్రమించెఁ బటువాద్యరవంబుల విస్తరించుచున్
హరిదురుసీమలన్ జయజయస్వనముల్ చెలరేఁగి మ్రోఁగఁగన్.

చ. ప్రజ లిటు లైక్యకంఠ్యముగ భవ్యవిధిన్ జయ వెట్టఁగా దిశా
వ్రజములు నా[ ]మున్ విజయరావములం బచరించె; నిట్లు ది
గ్విజయము సంగ్రహించెఁ బురి వీడకమున్న నృపాలమూళి; యా
సుజనత తావుఁ బాయకయ చూఱకొనున్ సకలేప్సితార్థముల్.

చ. కెరలి శతఘ్నికారవము గింగురు వెట్టకమున్న నట్టది
క్కరటులకర్ణరంధ్రములఁ; గంధగజప్రవరాధిరూఢుఁడై
నరపతి సాఁగ సౌధపరిణద్ధమనోహరపౌరయోషిదు
త్కరకరకీర్యమాణసుమదామములన్ శిరసావహించుచున్. 122

చ. జవనవనాయుజప్రకరశస్త్రశతాంగములన్ వసించి భూ
ధవపురకుమారశేఖరు లతంద్రబలాఢ్యులు శౌర్యధూర్వహ
ప్రవరులు సాఁగ రాయభమపక్షములందున నంగవించు మన్
సవిధవధూకటాక్షఘృణిజాల మశేషము వెంటనంటఁగన్. 123

వ. ఏవంలీల నయ్యిలాపాలకచూళికాలంకారుం డాకలితనాకలోకనాయక భోగాభోగమ్ము నపడగోలుకొనుచు, రాజధాని నతిక్రమించి, సకల సంపన్నశాఖానగరపుటభేదనపక్కణగణంబుల ననాతంకగతి నారసి శీలించుచు, సముత్తుంగాభంగశృంగశృంగారాలింగితాంబరాహర్మ్యాంతరప్రపాతప్రదేశంబులఁ బరిక్రమించి, పరితాడ్యమానభేరికాభాంకారభయానకావిరామవిరావవిభ్యదితస్తంభోద్ధావద్గండకభల్లూకపుండరీకలులాయవలీముఖభూదారకరిమాచలదంతావలావలీ పరిష్కృతానేకానోకహావికటిభూతనైసర్గికమహాఘురీకంబు లగునరణ్యానులఁ గడచి, లలనాజనచలాపాంగమాలికాజాలలీలావళిమలిమ్లుచకురంగసముదంబమాంసలంబు లగు శాద్వలంబులపై నడచుచు నెడనెడ శాబరనాయకలోకంబు వినయవినయవినమితమస్తకన్యస్తహస్తులై ప్రస్తుతించుచుఁ గానుక వెట్టు మృగమదాదివస్తువుల సానుగ్రహానందం బెడందఁ జిందులుద్రొక్కఁ బరిగ్రహించుచు, సాంద్రీకృతనిజమతంగజయూథంబులే పిండిలంబులుగా నవేగాపగానివహంబుల నుత్తరించుచు, నాసేధించునవనీధవుల నవలీల నాశంసించుచు, నామతించునిలాపాలుర ననుకంపామతి నివతళించునుడికారంబులఁ గుస్తరించి యాదరించుచు, నిట్లు పటువిశంకటవైఖరి విహారంబు నవదరించుచుఁ బ్రయాణించునవసరంబున. 124

ఉ. ఆలములోన నాహరిహరాదులు నిల్వఁగ నోప రీమహీ
పాలకుఁ బ్రోల మే మనఁగఁ బాటియె సేనలఁ జేతులారఁగాఁ
గాలున కీయనేల బలిగా నృపగా నని కౌశికావనీ
పాలుపదంబులం దిగిరి ప్రాజ్ఞనృపాలుల్ మగగాలకానుకల్. 125

చ. నిజబలలోపముం బరిగణించి యవారణకౌశికావనీ
భుజబల మాకళించుకొని పుంజుకొసంగ నిరాశ లాత్మలో
విజయముఁ గుండలించుకొని పీడఁగ నేరక క్షాత్త్ర మొందలో
యబిరము వాసి యాజి; విజయంబు గనుంగొని రామఁరతిన్. 126

తే. గీ. కుశికనందనుసేనలోఁ గొంతమంది
తలకడచి శత్రుసేనలఁ దాఁకి వాని
నురిచియాడినవార్తయే యెఱుఁగ వైరి
వెనుక నడి నడచెం మహావీరవరులు. 127

చ. చిదుపలు సేసి స్యందనవిశేషములన్ గజసైంధవమ్ములన్
విదిచి పదాతిలోకమును వెంపరలాడి; చలింపఁబోక త
మ్మొదిచినరాజచంద్రుల ననేకుల నేలకుఁ దెచ్చి; భూతలం
బ్రదువఁగ గాధిసూనుచతురంగబలంబులు సాఁగె నుద్ధతిన్. 128

శా. ధీరోదాత్తుఁ డసహ్యవిక్రముఁడు గాధేయుండు నిర్జించి నా
నారాజన్యుల నీప్రకారమునఁ గాన్కల్ నాచి ప్రాచీలస
త్పారావారముఁ జేరి తత్తటి జయస్తంభంబు నాటించి త
త్తీరంబందు వసించెఁ గొన్నిదినముల్ తీఱఁగా బలాయాసముల్. 129

మ. పరిశీలించుచు దూరదర్శినులచేఁ బ్రాచీమహావేలనా
గరతీరాచితతద్ధరావరబలౌఘంబుం దృఢతన్ భీతిచే
సరకుల్ తత్తటమందు దింపక తరీజాలమ్ము నౌకామ్మడిన్
మఱలం జేయుచుఁ జేరె నద్దవిడి తన్మధ్యాబ్ధి సాంయాత్రికుల్. 130

మ. అమితోత్సాహముతోఁ బదాతిజను లాయాసంబు వో వీరపా
ణముఁ గావించుచుఁ దాళమధ్యముల హుంకారించుచుం గౌముదీ
కమనీయామలసైకతంబులఁ బెనంగన్ మంపుగుంపుల్ పద
క్రమముల్ దప్పఁగ సంచరించిరి వృథాఖ్యానంబు లేపారఁగన్. 131

సీ. మొనమొన్న కాఁపురంబునకు వచ్చిన తన
జవరాలి నొక్కండు సంస్మరించె
వెడలునప్పుడు తన వెలఁది ముద్రించిన
ముద్దుదొంతరఁ దలపోసె నొకఁడు
వర్ణించె ముదిరినబమ్మచారి యొకండు
తూరుపుపడుచుల సొరుతీరు
పురుఁడు వోయించుకోఁ బుట్టింటి కేగిన
నిండుచూలాలి నొక్కండు తలఁచె

తే. గీ. నాశరత్కాలచంద్రిక, లాతరంగ
శీకరాకీర్ణపవమానశీతలతలు
నాయకూపారగంభీరహారిరవము
లాముకవియుచు నాయాస మపనయింప. 132

చ. సకలచమూపతుల్ సచివసత్తములుం బ్రణిధుల్ వసించి కౌ
శికుపటవాసమందు నృపశేఖరునానతి దాక్షిణాత్యభూ
పకులబలాబలంబుల సుపంథల నొత్తరణార్హనిమ్నగా
నికరవిశాలతల్ కడు గణించిరి నిశ్చలితాంతరంగులై. 133

తే. గీ. అసితరాతాడ్యమానప్రయాణభేరి
ఘోరరావోదయ మ్మరుణోదయమ్ము
నేకకాలమ్మునం దాట యెఱిఁగి తరలె
దక్షిణాపథదండయాత్రకు బలమ్ము. 134

ఉ. ఎంతయుఁ దద్విహాయస మహీనగరిఁ మహిం బ్రావి ముద్దులన్
దొంతర సేయఁ జోటఁ గనుదోయికిఁ బండువు గాఁగ బాలభా
స్వంతుఁడు సాగరాంబువుల స్నానము సేయఁగ మున్ని తేలె నిం
తింతగ నింతగా మఱియు నింతగ నంతగ నంత వింతగన్. 135

తే. గీ. ఒడయఁ డల్లన బ్రాహ్మముహూర్తమంద
మేలుకొని కాల్యకరణీయపాళిఁ దీర్చి
స్నాతుఁ డై సంధ్య వార్చి భాస్కరున కర్ఘ్య
మిడి క్రమించెను నైజవాహినిని జేరి. 136

శా. గ్రామీణామితసస్యసంపదలఁ గారాకూరముల్ సేయ కా
రామాంతస్సుమనఃపరీమళము లాఘ్రాణించుచుం బోయి లో
పాముద్రేశని యోగకుంచితశిరోభాగాంచితం బైన విం
ధ్యామేయాద్రిని దాఁటి దక్షిణముఖం బై సైన్యముల్ వోవుచున్.

మ. తపతీనర్మదలం దరించి తమి చిందన్ సప్తగోదావరం
బుపసర్పింపఁ ద్రిలింగదేశపతి సంయోజించి సైన్యంబు లు
త్కుపితుం డై వడి మోహరించె రిపుసందోహమ్ము నుద్దండతన్
విపులావేశితవిప్రకారము లెదం బింపిళ్లు గూయం గడున్. 138

మ. పటుకోలాహల మొప్ప వైరులకు దిగ్భ్రాంతుల్ దువాళింప ను
ద్భటశస్త్రావళిరోచు లల్లుకొని యంపాచార మై పాఱఁగా
విటతాటం బొనరించి రాంధ్రధరణీవీరుల్ రిపూత్తంసహృ
త్స్ఫుటభేదంబు రథాశ్వదంతినిధనంబుల్ లీల సాధించుచున్. 139

మ. కలఁగంబాఱిన నాత్మవాహినుల నగ్గాఢేయసేనాను లు
జ్జ్వలితారుంతుదవాక్ప్రసారముల చే వారించి పూరించి యాం
ధ్రుల పైనం బురికొల్ప నాసమయమందున్ పోరు ఘోరంబుగా
బలిసెం బాఱె నపారవీరరుధిరాంభశ్చార మేపారుచున్. 140

కం. ఆయూరుపోరునందున
వేయికి నొకఁ డగుచు నాంధ్రవీరులు పగఱన్
మాయురె! మాఱ్కొని మలఁచి ర
నాయాసముగాఁ బిరీన నలబల మొలయన్. 141

ఉ. కొందలమందు సైన్యములకున్ వెగువల్ తులకింపఁగా మధు
ష్యందుఁడు కౌశికాగ్రతనయాగ్రణి సాగ్రహలీల సుందర
స్యందనసంగతుం డగుచు నాదరబాదర నేగి తాఁకె మ
ధ్యందినభానుమండలవిధంబునఁ బొల్చి త్రిలింగవాహినిన్. 142

మ. అరవాయిన్ సడలించుకొంచు జనితాయాసమ్ము నెట్టెట్టులో
విరియం జేయుచు రాకుమారు తెగువల్ వీక్షించి యుత్సాహముల్
కరిసింపం జనియెం బిఱుంద పెలుచన్ గాధేయపాదాతికం
బరిసేనానివహంబు నొక్కుమొగి నాహరించు పేరాసతోన్. 143

కం. దళవాయి యెచ్చరింపఁగఁ
గలగుండు వడం ద్రిలింగఘనసేనలపై
దళకొని యాశ్వికదళములు
కలయ నుఱికెఁ బూర్వాణాబ్ధిగతభంగగతిన్. 144

తే. గీ. అంకుశాగ్రము కుంభాంతరామిషంబుఁ
జవిఁ గొన న్నాటి మావంతు లవియఁ జేసి
గంధసింధురయూథమున్ గదియఁ ద్రోలి
రాంధ్రబలముల నదనద లభిచరింప. 145

కం. తలపడియెఁ బూర్వపశ్చిమ
జలరాశులపోల్కి నుభయసైన్యములు దిశా
వలభీసీమల బృంహిత
ములు హేషలు సింహనాదములుఁ గడ లొత్తన్. 146

కం. ముందుగ నేతెంచుమధు
ష్యందునిఁ గని యాంధ్రధరణిజానితనూజుం
డందపడు తేజు నడిపి య
మందగతిం బరపె నిశితమార్గణగణమున్. 147

ఆ. వె. ఆయజిహ్మగముల నవలీలఁ దెమలించి
గాధిపౌత్రుఁ డతనికార్ముకమ్ము
దునిమి కేతనమ్ము దుత్తునియలఁ జేసి
యార్చి యట్టహాస మాచరించె. 148

చ. కనలి శరాసనాంతరము గైకొని యాంధ్రనరేంద్రసూతి యా
తనినిటలంబుపైన నొకదారుణబాణము నాటి కంకటం
బును దునుమాడి నాల్గుశరముల్ హృదయంబున గాఁడ నేసి కే
తనమును ద్రుంచి రథ్యములు ధారుణి మోకరిలంగ నేయుఁడున్.

మ. కనులం జీఁకటు లాక్రమింప నొకసీత్కారమ్ము గావించి కే
తనదండమ్ము నొకింత యానుకొని హస్తంబందు ఘాలంబు దా
ర్కొన మంపిల్లునిజావనీధవకుమారుం గావ గాధేయువా
హిని రాఁబోవఁగ నడ్డమై యెదిరిచి రెంతే నాంధ్రశూరాగ్రణుల్.

ఉ. తొండముఁ దూటి వాలమును దూసి శరం బురుగంగ నాంధ్రకో
దండకలాప్రవీణు లురుదర్పముతోఁ జనుదెంచుమత్తవే
దండములన్ గుభిల్లు రని ధారుణిపై వడిఁ గూల నేసి రా
ఖండలుఁ డుగ్రవజ్రమును గైకొని కొండలఁ జెండుకైవడిన్. 151

చ. సిడములు ద్రెళ్లి భూతలముఁ జేరక మింటఁ బతంగనైఖరిన్
గడలుకొనెన్ బురశ్శపదవిఖండనసంగతి మోకరిల్లి విం
గడముగఁ దన్నుకొంచుఁ దురగంబులు కూలెఁ బదాతిమస్తముల్
తొడఁబడుచుం బడెం బుడమి దొప్పలుదోర లనాంధ్రసేనలన్. 152

కం. వారువములు సమయుట నిట
సారథి యేమియును జేయఁజాలక మూర్ఛా
సారణి మున్గినరాజకు
మారు నుపచరింపసాగె మాయనిభక్తిన్. 153

శా. ధారాపాతముగా నిటాలమున రక్తం బాముతిల్లంగ శా
రీరస్మారక మేది యున్న యెడ నారీతిన్ వినిద్రించుచోఁ
దేహం బెంతయుఁ దోలి యాయహితసూతిన్ బట్టి కారుణ్య మే
పారన్ నైజశతాంగమం దిడి త్రిలింగాధీశసూనుం డొగిన్. 154

కం. ఇనుమిక్కిలి చేలాంచల
మున నొత్తుచు నెత్తు రరదమును మఱలించెన్
దనశిబిరము దెస కంతట
నినుఁ డపరాచలము వెనుక నేమా యయ్యెన్. 155

మ. క్రమవృద్ధి న్నెఱసంజచీఁకటి దిశాచక్రమ్మునం గ్రమ్మ జ
న్యము నానాఁటికి నాఁగఁ జేసి రొగి సేనానాయకుల్; తెన్గుసై
న్యము తత్కాలజయావలేపములతో, నన్యంబుఁ జింతావమా
నము లానం గుసిలించు చిత్తములతో, నట్టాడుచుం గ్రమ్మఱన్.

సీ. యుపమాంసఖండముల్ చవిచూచుటకు నక్క
లంగలించుచుఁ దొంగి తొంగి చూచె
జివ్వ జివ్వ మనంగ తెక్క లల్లార్చుచు
రాబందుగము లంబరంబుఁ జుట్టెఁ
దల ముంచి క్రొన్నెత్తురులఁ ద్రావ గూబలు
తమకులాయములలోఁ దత్తరించెఁ
గహకహారావముల్ గదుర బేతాళముల్
మలయుచు మాలమాలలఁ జరించెఁ

తే. గీ. గంఠగతజీవనుల హీనగళరవంబు
లూచముట్టంగ నంతసంబు నొందువేళ
గోరువెచ్చని నెత్తురుల్ పాఱుచుండ
శిబిరముల రెండుబలములు చేరుచుండ. 157

శా. సాయంసంధ్యను వార్చి గౌతమిని విశ్వామిత్రభూమీధవుం
డాయోర న్నడయాడుచున్ బవన మాహారించుచోఁ జారఘో
రేయుం దొక్కరుఁ డేగుదెంచి భయముల్ రేకెత్తఁ గంపించి వా
లాయంబుం గొనఁగా గళం బెదియుఁ బల్కన్ లేక దుఃఖింపఁగన్.

చ. తటుకున జాఱు ధైర్య మెడఁదం దలఁపుల్ పదివేలు పుట్ట హృ
త్స్ఫుటమును జల్లనన్ జనుసిమోము నెగాదిగఁ జూచి చూచి యా
కటుతరవార్త నైన వినఁగా హృదయమ్మును గొంతకొంతగా
దిట వొనరించి రాజు ప్రణిధిం గని వాకొన నానపెట్టెఁగన్. 159

తే. గీ. "ముసుకొని తెనుంగుజోదులు మోసగించి
మసకుమారమధుష్యండు" నని సగంబు
మాట చెరునోట వెడలకే మనుజవిభుఁడు
హా! శివా! యని బిట్టార్చి యవని వ్రాలె. 160

తే. గీ. పరిసరమ్మునఁ డాదుపరిజనమ్ము
పరుగుపరుగున నేతెంచి పరిచరింపఁ
బుడమితేఁ డల్లనం దేటి పులపొడుచుచు
డిల్లపోయెను నెమ్మేను పుల్లవడఁగ. 161

తే. గీ. కోపసంతాపములు రెండు గోరగింప
జాఱువాఱఁగఁ గన్నీరు జాలువాఱ
నెండయును వానయును రెండు నొందుకొనిన
శిఖరిశిఖవలెఁ బొల్చెఁ గౌశికముఖంబు. 162

చ. వికటగతిన్ హసించు నొకవేళ దెసల్ కలయం గనుంగొనున్
భ్రుకుటి ఘటించి యొక్కపరి; మోమఱవాలిచి చాల పక్ష్మలిం
పక కనుఁబంటిచే నదుసువాతెఱ నొక్కుచు వెచ్చ నూర్చుఁ గా
శిసుఁ డొకమాఱుఁ, జాల కరిసింపఁ గుమారునిపైనఁ బ్రేమముల్.

మ. తెలవాఱం బని లేదు మా కిపుడె సంధింతున్ మహాస్త్రంబు నీ
తెలుఁగుంబువ్వులఁ గాళులం జమరెదన్ రెం డల్గుఁ గోదండ మన్
పలుకుల్ సాంతము గాకమున్న యెదుటం బ్రత్యక్ష మయ్యెన్ ముఖా
చ్ఛలదానందపుఁడు రాజనందనముఖుష్యందముండు లేనవ్వ్యాశోన్. 164

చ. జనకుపదారవిందములసన్నిధి సాఁగిలి మ్రొక్కి పూసగ్రు
చ్చినగతి విన్నవించెఁ దమ సేనలు గాంచినభంగపాటులున్
దనదురవస్థ నాంధ్రజననాథకుమారునుదారభావమున్
దన కరి సేయుగౌరవవిధానముఁ గ్రమ్మఱఁ దన్నుఁ బంచుటన్. 165

చ. విని జననాయకుండు తనవీనులఁ గన్నుల నమ్మలేక యిం
కను గను మోడ్పకుండఁ దటకాపడి చూచుచు నుండెఁ గ్రమ్మఱన్
జనకునకుం గథించె నొగిఁ జర్వితచర్వణమై రహింపఁగాఁ
దనదుసుఖాంతవృత్తము ముదమ్మునఁ దండ్రి గవుంగిలింపఁగన్. 166

ఉ. "ఏలినవారివిక్రమము నింతయు నేరక మిమ్ముఁ బట్టె నా
బాలకుఁ, డాంధ్రభూవిభుఁడు బాగుగ నేర్చినయూతఁ డౌటఁ దా
వైళమ బంపె గౌరవసపర్యలఁ జేసి" యటంచు నొక్కవా
చాలుఁడు వల్కెఁ గాశికవిశాలకృపాసుధఁ జూఱలాడఁగన్. 167

చ "అరయక యిచ్చవచ్చినటు లాడెద విచ్చక మాంధ్రు లెల్లరున్
సరసు లుదారమానసులు సత్యపరాక్రము; లాకళింతు సం
గరమున వారిపౌరుషవికాసవిశేష ఏ శేష మెల్లి బా
హిర మగువేళ" నంచు సుతుఁ డెంతయు మార్వలుకంగ నవ్వుచున్.

ఉ. ఆరయ వీరులే యగుదు రాంధ్రులు; వారలు పోరు మాన రీ
ధారుణిఁ గూలుదాక; యిది తథ్యము సూ; రణరంగమందు నే
వీరవిహారముం జలుప వేలుపులు న్నిలువంగ లేరు ని
ష్కారణ మేగతిం దునుముఁగాఁగలవాఁడఁ గుమారదాతలన్. 169

కం. అని జనకాంతుం డంచల
మును వీడి యమించుతలఁపు మురళించుచు న
ల్లన లేచి యరత నమరెను
తనశిబిరము డెసకు నడిచెఁ దనయుని గూడన్. 170

తే. గీ. ఆగ్రహం బెంతయో దయావ్యాప్తి యంత
కఠినభావ మెంతో యక్కటిక మంత
సంతసం బెంతయో మఱి చింత యంత
మనన్నృపుని కంచుఁ బరిజనుల్ సనిరి వెనుక. 171

చ. తన కభియాతిభూపతి సుధామధురోక్తుల గుప్పళించుచున్
నిసిచినగౌరవంబుఁ బురణించుతమిం దనయుండు వాకొనన్
వినుచు నొకంత కన్మొగిచి విచ్చిన యంతనె యేకయామమై
చనియెఁ బ్రియామ యాధరణిజానికి నైశిమ చౌకళించుచున్. 172

కం. సూర్యోదయసమయమునం
దార్యఘ్నను లమర, సమరదోహలులై దో
ర్వీర్యము చిప్పిల నాంధ్రు ల
హార్యమహాధైర్యు లాజి కాయితపడఁగన్. 173

ఉ. కానఁగరాఁడు శాత్రవుఁ డొకం డయినం గనుచూపుమేరలో
వీనులకున్ వినంబడదు వీరబలాగమనస్వనం బనన్
సేన నతిక్రమించి నిలిచెన్ యువరాజును గూడి యాంధ్రభూ
జాని కనుంగొనన్ మదిని సంశయముల్ చెలరేఁగి యాఁపఁగన్.

ఉ. కౌశికచక్రవర్తి త్రిజగంబులు మాఱొక్కనినం జలింప కా
వేశముతోడ నొంపఁగలవీరుఁడు భీరువు గాఁడు; సంధిసం
దేశము గానరాదు జలధిం బురుడించుబలంబు లింతకున్
లేశము వచ్చుజాడఁ గనరే మనుచున్ నృపమౌళి పల్కుచోన్.

చ. జవనవనాయుజప్రకరచారుసువర్ణశతాంగరాజమున్
బవనసమానవేగమునఁ బర్వఁగఁ జేయుచుఁ గాశికావనీ
ధవుఁడు నిజాత్మజాతసహితం బహితాతిసమీపభూమిఁ దా
నవతరణం బొనర్చె నెడ నాంధ్రవిభుం డెదు రేగ నూనుతోన్.

చ. ననుఁ గనుఁబ్రామి నాడయము నాచిరి చల్లఁగఁ దెన్గువారి నే
మనఁదగుఁ బ్రోడలే యగుదు రన్నట నంచుఁ బిసాళినవ్వుతో
ననుకుశికాత్మజాతునకు నాంధ్రనృపాలుఁడు నవ్వి మున్ను పా
యనముగ మీతనూజమణి నంపి విధేయతఁ జూపలేదొకో. 177

ఉ. ఈయపనిందఁ దెన్గుతల నేల ఘటింపఁగఁ జూతు రయ్య య
న్యాయముగా నఁటంచు రస మామకొనం బలుకంగ; నాతఁడున్
మాయురె! మాది మా కిడుట మాన్యము లిచ్చుట యన్న షామొతల్
మీయెడఁ జెల్లు నంచు నెలమేల మొనర్పఁ ద్రిలింగనేతయున్. 178

ఉ. ఈవిధిఁ జక్కలింప నగునే మము వింతగఁ బల్కి మీవీరరో
జీవి మదీయసూనునకుఁ జిక్కుటచేత మదీయుఁడే యగుం
గావున నయ్యనర్ఘమణిఁ గానుకఁగ మీ రలరంగఁ బంచినా
మోవసుధేశ! యంచుఁ బ్రతియుక్తి రచింప హసించి యాతఁడున్.

తే. గీ. ఆరడము మేరమీఱ నయ్యాంధ్రధవునిఁ
గౌఁగిలించెను; యువనృపుల్ కౌఁగిలించు
కొనిరి వారుఁ బరస్పరంబును; త్రిలింగ
వీరవాహిని మోదిల్లి వెల్లివిరిసె. 180

ఆ. వె. తెనుఁగుతేనికోర్కిఁ దీర్ప విశ్వామిత్రుఁ
డతనిరాచనగరి నావసించె
వాసరత్రయంబు వాహినీసహితంబు
పిదపఁ జనె నవాచి వేగిరించి. 181

ఉ. దీవస మొప్పఁగాఁ దెనుఁగుసీమల దాఁటి యసారుఁ డయ్యెఁ దాఁ
గేవలమాయలన్ రిపుల గెల్వఁగఁ జాలఁగ నుత్సహించు నా
ద్రావిడమేదినీశునిమదంబు యథాయథ లై తొలంగ వి
ద్రావితుఁ జేసి సుందరపదార్థములన్ గిలుబాడి యాదటన్. 182

కం. హాటకరత్నోపదఁ గ
ర్ణాటకరాజేంద్రుఁ డప్పనము సేయ నిరా
ఘాటతఁ జని జయకేతువు
నాటెం గౌశికుఁడు దక్షిణపయోధితటిన్. 183

తే. గీ. సరసిజాతహితాహితచారుమండ
లోదయాస్తమయంబుల నొప్పఁ గ్రమత
ప్రాగపరనీరధుల గాధిభవుని సేవ
గాంచెఁ గన్యాకుమారికాగ్రమున నిలిచి. 184

శా. తే[illegible]తుఁడు గాధినందనుఁడు తత్తీరంబువం గొన్ని నా
ళ్లోజ న్నిల్పి క్రమంబుగాఁ గడచి యెన్నో రాజ్యముల్ గెల్చి ని
ర్వ్యాజప్రక్రియ వీర్యమాంసలమహారాష్ట్రప్రదేశంబులం
దాఁ జేరం జనియెన్ వనీనిబిడగోత్రస్తోమమార్గంబునన్. 185

చ. కనుమలలోఁ గ్రమక్రమముగా వరుదెంచుచు నున్న సేనఁ బై
కొనుకినుకం గనుంగొనుచుఁ గుప్పలుతిప్పలుగా మహోపలా
ళిని దొరలింపసాగి రతలేపము గ్రాలఁగ నేటవాలుగాఁ
దనరుముల న్నిలంబడుచు దారుణభంగి వనేచరాగ్రణుల్. 186

తే. గీ. దళముగాఁ బడుఖాలకుఁ దాళ లేక
వెనుకకున్ ముందునకుఁ బోవ వీలు లేక
చేయునది లేక గాధేయుసేన వంత
పటవణింపఁగఁ గలగుండు వడియె నంత. 187

ఉ. ఈరము లైనయీరకముల నెందో వసించినవారిఁ గానఁగా
నేరక స్తంభనాస్త్రమున నిల్పి కిరాతశిలాప్రపాత; మే
పారుశిలావిభేది యనునస్త్రముచేఁ బథరోధితద్ద్రుమ
ద్వారము దంచి ధూళి నెడఁబాపి సమీరవరాస్త్రయోజనన్. 188

మ. బలముల్ లోయల దాఁటి శాద్వలములన్ వర్తింపఁగాఁ జేసి వి
హ్వలతన్ మానిపి కౌశికుండు చనుచో హంకార మేపారఁగాఁ
బ్రళయాంభోనిధిభంగిఁ బొంగుచు మహారాష్ట్రావనీజానిసే
నలు దాఁకెన్ భయదార్థతూరము లమందవ్యగ్రతన్ మ్రోయఁగన్,

తే. గీ. ఉభయపక్షములందలి యోధవరులు
నుగ్రవైఖరి సలిపి రాయోధనంబు
కాని యేభూమిపాలునిగళమునందు
వేయదాయెను విరిదండ విజయలక్ష్మి. 190

చ. పడమటికొండపై నినుఁడు పాదము మోపకమున్న తేని నే
జడిగొనునంపలం గసిమసంగెద నంచుఁ బ్రతిజ్ఞ వట్టి వే
పుడమిని రాల్చి శాత్రవసమూహము నందఱ కన్నిరూపు లై
తడఁబడ నేసెఁ గౌశికుఁడు దాయను దాఁకి శితాశుగంబులన్. 191

ఉ. ఎక్కానులీల నాతఁడు ననేకశరంబుల గాధిసూతికిన్
వెక్కస మైనపోరు నెఱపెన్; గుశికాన్వయమాళి క్రుద్ధుఁడై
చక్కడఁగించె రథ్యముల సారథిఁ ద్రుంచె సమంత్రకంబుగా
నొక్కశరమ్ము నేసె నది యూడ్చె విరోధిశిరోధి నంతటన్. 192

తే. గీ. రాజు హాటుఁ డౌటఁ గని మహారాష్ట్రసేన
పంచబంగాళ మై పాఱె; భానుఁ డంత
నస్తమిల్లె మహాపరాహార్యశిఖరిఁ
గౌశికబలంబు యామిసం గడపె నచట. 193

ఉ. కోపము లంతరంగమునఁ గూడియు నేమియుఁ జేయలేక ర
క్షోపద నాయరాతితనయుం డిడఁ గైకొని కౌశికుండు నా
నాపదనీనిరోధిజననాయకలోకముఁ జౌకసేయుచున్
జూపురె! నాటఁగాఁ బనిచెఁ బశ్చిమవార్ధి జయధ్వజావళిన్. 194

ఉ. అచ్చొటు వాసి యేగుచు నహర్నిశముం బరరాజకోటి యం
దిచ్చునుపాయనంబుల నతిప్రమదంబున సంగ్రహించుచుం
గ్రచ్చఱ సాఁగె నుత్తరముఖంబుగ దిగ్విజయైకకీర్తిపా
టచ్చటుఁ డై రహింపఁగ హుటాహుటి శీతనగావలోకి యై. 195

మ. తలపూనైనను వాడకుండ శరసంధానమ్ముఁ గావించి భూ
తలశయ్యావలిఁ బెద్దనిద్దురల నందం జేసి నేపాళసే
నల; నీహారధరాధరాగ్రతటులన్ నాటించె గాఢేయభూ
వలయేశుండు జయధ్వజంబు నవలేపప్రాభవాభోగుఁ డై. 196

శా. సైన్యంబుల్ తమయిచ్చవచ్చినటు లుత్సాహమ్ము రెట్టింపఁగా
నన్యాతంక మొకింత లేక సితవీర్యామద్యముల్ గ్రోలుచుం
గన్యాకుబ్జపురావలోకనము నాకాంక్షించుచుం గ్రమ్మఱెన్
జన్యగ్రంథలలామమందు నఖిలాశ్వాసాంత మై యొప్పటన్. 197

సీ. అడఁగోలుకొనియె వంగాధీశుదోస్సార
మడఁజడి వెట్టెఁ జోళావనీంద్రు
నగడుపడం జేసె నంగభూనాయకు
నతకరించెఁ గళింగకుతలనేత
నపచయించెను గేరళావనీశుశిరంబు
నభిభవించెను గౌడవిభువ కేళ్యు

నపహరించెను బాండ్యనృపతిసర్వస్వంబు
నరవాయిగొనఁ జేసె యవనధవుని

తే. గీ. పారశీకుని ద్రుంచె నేపాళు నొంచె
బర్బరుని గూల్చె సౌరాష్ట్రపతిని ద్రీల్చెఁ
గోసలు నడంచెఁ గాంభోజు నీసడించె
సాహసావేలగాఢేయ బాహులీల. 198

ఆ. వె. అంచు వాహినీశు లంచించుకొంచును
ననతిదూరమందు ననుగమింపఁ
దనశతాంగమునకు దాపున యువరాజు
సానుజుండు బరఁగ నరిగి యరిగి. 199

సీ. పరమపావనశౌరిచరణకల్హారము్న
దనపుట్టినిల్లుగాఁ దనరుదానిఁ
గాత్యాయనీదేవి కాంతాళమునఁ జూడ
హరశిరోంతరసీమ నులుకుదానిఁ
ప్రాలేయశైలోపవనవిహారము సల్పి
సొగసు తుంపెసలాడ దిగినదానిఁ
బ్రవహించి సగరపుత్రశ్మశానావని
సద్గతిదానముల్ సలుపుదాని

తే. గీ. సక్రమంబుగ నెల్లెడ శాంత మూని
జీవనోపాధిఁ బ్రజకు నార్జించుదాని
వనధినాయకుఁ గని మేలుపడినదానిఁ
గాంచె నాభూమిజాని గంగాభవాని. 200

మ. కని తత్కాలమునన్ వసించుటకు సంకల్పించి యాదేశమున్
దనసేనానుల కందఁజేయుటయు నద్ధాత్రీతలేశుండు; వా
రనుమోదించి నిమేషకాలమున నాయత్తంబు సేయించి రం
దనుకూలావనిపై గుడారములఁ దీరారామమధ్యంబులన్. 201

చ. చిటిపొటిగాలు లాయలలచి త్తడి గుత్తికుఁ బుచ్చుకొంచుఁ జెం
గటఁ దల లూఁచు చెంగలువకమ్ముదుమారము రేచి తావులన్
గిటుకున నాచి మోచికొని కేరుచుఁ జేరెడి మేరమీఱి త
త్తటమున వాడి వేడిమికిఁ దాళఁగలేక సళించు సేనకున్. 202

మ. ఇనబింబాంతరవర్ణసప్తకము నెంతేసిం గదంబించి జీ
వనసచ్ఛీకరపాళిలోఁ బ్రతిఫలింపన్ నీరు గోరాడుచున్
జనితానందముతోడ నీఁదిరి నిమజ్జద్దంతియూథోత్థిత
స్వనదూర్మిప్రకరాభికర్షణవిశేషక్షాళితుల్ సైనికుల్. 203

శా. నానాదేశవిశేషచిత్రకథనాసంధమ్ముతో సంతతా
త్మానీకేభనిమీలికాపటువచోహంభావసందీప్తితో
గానాలాపవిలాసవైభవముతోఁ గాంతాప్రసంగంబుతో
సానందమ్ముగ నేగె యామిని ప్రమీలాఘూతసేనాళికిన్. 204

స్రగ్విణీవృత్తము. వైదికాచారసంపత్సదామూలశ్రీ
పాదపంశాంబుధిభ్రాజితేందూదయా!
వేదవేదాంగసంవేదినారావతం
సా! దయాసారణీచారునేత్రద్వయా! 205

## గద్యము.

ఇదిశ్రీహరిహరదేవదయాపాంగప్రసారణసమాసాదితోభయభాషాకవితా
రచనాప్రవీణ, కాకరపర్త్యుపనామక కాశ్యపసగోత్రపవిత్ర, బాప
నార్యభిషక్సార్వభౌమపౌత్ర, వేంకమాంబావేంకటరాయ
సుధీపుణ్యాదంపతితనూజ, కవికంఠీరవ, కవిమూర్ధన్య
మహాబిరుదవిరాజమాన, కృష్ణశాస్త్రిప్రణీతం బైన
కౌశికాభ్యుదయమహాప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము

హరిహరదేవాయ నమః

# కౌశికాభ్యుదయము

## ద్వితీయాశ్వాసము

కం. శ్రీనాథమహీనాథగ
ణానూనార్చావిధానహర్షితవిలస
న్మానస! చెన్నపురాంధ్రా
స్థానకవీ! కృష్ణమూర్తిసన్మేధావీ! 1

తే. గీ. చిత్తగింపుము దశరథక్షితితలేంద్ర
నందనుఁడు రామునకు శతానందుఁ డిట్లు
ప్రౌఢవాచావిశేషసంపదలు బొదల
గాధితనయోత్తరాఖ్యాయికం గథించె. 2

చ. కలువ మొకింత సొమ్మసిలఁగాఁ దెలిదమ్మి రవంత నవ్వఁగా
జిలిబిలిపాట తేనియలచిన్కులు తేఁటులనోట జాఱఁగాఁ
గలికివెలుంగుతోఁ బొడువఁగా నెఱివేగుచుఁజుక్క; కౌశికుం
డలయుచు నేగె గంగకు గుణాలయమూర్తి విడనాడి యల్లనన్. 3

ఉ. ఇంచుక నైజయానముల నేరికిఁ దెల్పక పోవుచుంట యే
లెంచుట సాజ మౌట గుఱుతించినకంచుకి తత్తటిన్ గవే
షించుచు గంగదాపున వసించునృపుం గని మేలిచేలముల్
గొంచును వెంట నంటె యటకుం జని యొడ్డున వేచియుండఁగన్. 4

చ. చని భాగీరథికిన్ నృపాలుఁడు నమస్కారమ్ము నర్పించి రే
వున నీరాడెను బ్రహ్మచారియుగళంబుం గాంచి సంధించి చెం
త నదీష్ణుం డగుమం బ్రసంగగతిఁ బ్రాంతంబందు వాసిష్ఠస
న్మునినాథాశ్రమ మున్న దంచు వినుచున్ మోదించి దర్శింపఁగన్.

చ. అగమిడ జువ్వరింపఁ దటిఁ జేరి రయమ్మున సంజ వార్చి సొం
పుగఁ జెలికాండ్రు దెల్పెడుల ముందుకొనం బరిధాన మూని నె
మ్మొగమునఁ బాపపూపసగవుల్ గనియన్ మృదులోక్తి మీఱఁగా
మిగుల నటూత్తమద్వయసమీపతలంబున కేగి యిట్లనున్. 6

గీ. మీఁగురూత్తము దర్శింప మిపులఁ గోర్కె
యంతరంగమ్మునం గ్రమ్మె నావసిష్ఠ
మునిభగవానుపూతాశ్రమంబుకడకుఁ
ద్రోవఁ జూపింపరయ్య మాతోడ వచ్చి. 7

చ. అనవుడు వార లియ్యకొని యున్నరనాయకుగోత్రనామముల్
విని మది మోద మంది పదపీకలితాశ్రమభూవిశేషముల్
మును మును వీవు మిఁక వెనుక మోమయి యూఁగుచుఁ జెప్పసాగి రా
మనుజవరేణ్యుకోఁగర మమాయికవాగ్రచనల్ చెలంగఁగన్. 8

మ. ఇదె మాండవ్యులపర్ణశాల యిదిగో యీశైవుగా నేగుచో
నదె జాబాలినివాసభూమి యఁట; మే మావంక కెన్నండుఁ బో
మదయుల్ నాస్తికు లామహాశయుసిశిష్యానీకముల్ గాన; నే
గుదు రీమాసమునందె వారెటకొ మాకున్ దూరదూరంబుగన్. 9

చ. ఇనువనుదారలం గలిసి యిచ్చటనే మును కాఁపురించె భూ
సురమణి యాజ్ఞవల్క్యముని; చూచితిరా యెటు పాడువాటెనో
పరమపవిత్రమై సెలయు వారిగవాదని; కుంభవృష్టిగాఁ
బెరుఁగును బాలు ద్రావితిమి వేసవివేలుగ నోప్పు లుంటచేన్. 10

మ. కనుఁ డాగుజ్జుగనున్న తోఁపు లటకుఁ గవ్యూతిదూరంబుగాఁ
జనుచో నచ్చట శాకటాయనులవాసం బుండు నాపొంత నుం
డును సాధాతకిపర్ణశాల; యట కెన్నోమాఱు లే నేగినా
మనవచ్చుఁ గురుదేవు లంపఁగ మఖవ్యాపార మీక్షింపఁగన్. 11

సీ. ఈవటచ్ఛాయనే మాణవిష్ఠులవారి
శబళ గోమంధంబు సంతరించు
నీమార్గమునఁ బోయి మామునిచ్ఛాత్రులు
కుశసమిత్ఫలములఁ గోసికొందు
రీయడ్డుత్రోవలనే యేగి మావాడ
తపసికన్నెలు పూల నపచయింతు
రీమావితోఁపునందే మాసహాధ్యాయు
లాయనధ్యయనకాలాళిఁ బుత్తు

తే. గీ. రీపొలంబులఁ దమకుఁ దా నే మొలిచిన
నీవరుల నుంఛవృత్తిచే జీవయాత్రఁ
గడపుచున్న మహాత్ములుఁ ఖగగణంబు
గాక యొం డెవ్వరును జేతఁ దాఁకఁబోరు. 12

శా. మావాడన్ మొనమొన్ననే కుటిని నిర్మాణించెఁ బో గౌతమాం
తేవాసిందుఁ డొకండు చేరి నిజసాధ్వీయుక్తుఁ డై; తర్కవి
ద్యావాల్లభ్యముచే జయించెఁ బటువాదప్రౌఢి మ మ్మందఱన్
వీవాదంబె ఫలంబొ శాస్త్రములకున్ విజ్ఞానమో చెప్పుమా! 13

ఉ. ఆకనుపించుమావులకు నావల నేఁబదిబార లేగఁగాఁ
జీఁకటిమ్రాకుబిందములచేతఁ బరీతము లైనతావు లె
న్నో కల వందు నర్హులకు నొజ్జలు జ్ఞానకళోపదేశముల్
మేకొని చేయుచుందురు; గమింపము మే మట వార లున్నచోన్.

ఉ. చింతనసేయు వేదములఁ జీటికిమాటికిఁ గల్గుతప్పులన్
జెంత నెసంగుకొమ్మల వసించుశుకంబులు దిద్ది తీర్చి మా
కెంతయు సాయ మౌ; గురుల కే మొగిఁ బాఠము లప్పగించుచోఁ
గొంత విడంగ శారి పలుకున్ గురుమూర్తి చిరాకు నందఁగన్. 15

చ. చదువక పాఠముల్ తిరుగుఛాత్రులపైఁ గడు నాగ్రహించుచున్
గదుమఁగ మాగురూత్తములు క్రన్నన నచ్చటి కేగుదెంచి యా
సదయ యరుంధతీజనని శాంతిని గూర్చుచు భర్త కల్లనన్
గదియుచు మాకు బుద్ధులను గమ్మగ నేర్పును బుజ్జగించుచున్. 16

కం. ప్రాతర్వేళలఁ దనతను
జాతులరీతిగనె సౌఖశాయినికయు సౌ
స్నాతికయు నగుచు మామా
మాతలఁ దలపెట్టకుండ మనుచున్ మమ్మున్. 17

చ. దురుసుగ నెంతయో చదివి దూపిలినారలు; కట్టిపెట్టుఁ; డీ
వరుస నహర్నిశంబుఁ జదువం గడు నెందును లేఁతగుండియల్
పరుగున రం డిదే చెఱకుపానక మానుఁడు; పండ్లివే కొనుం
డరుగుఁడు చల్లగాలి కని యాయమ మమ్ములఁ జీరు నర్మిలిన్. 18

కం. ఒగి శిష్టానధ్యయనం
బగు మా కిట సనకసారదాదిమహాపూ
నిగణాగమనంబులఁ దఱు
చుగ; నత్తఱి నిచటిశోభఁ జూడఁగవలయున్. 19

కం. మామాతం గనుటకు లో
పాముద్రాసతియుఁ బూజ్యపాదాత్రివధూ
టీమణియుం జనుదెంతురు
వేమాఱు మదంబ మిగుల వేడుక పడఁగన్. 20

మ. అని వా రాశ్రమవాటికానుదినకృత్యంబుల్ నివేదించుచుం
జనువోఁ జూచుచు విస్మితిం గనుచు విశ్వామిత్రభూపాలకుం
డనువర్తించెను వారిఁ గంచుకియుతుం డై యావటూత్తంసులం
దున నొక్కండు నృపాలురాకఁ దెలుపన్ దూసెన్ రయంబారఁగన్.

సీ. వెన్ను నాకుచు లేటిపిల్లలకుం జన్ను
క్రోల్పులిబాలెంత గుడువఁబెట్టె
దంతిశుండంబుఁ గైదండగాఁ గొని మృగ
రాజంబు వనవిహారమ్ము సల్పెఁ
బోడయెండయైనఁ బైఁ బడకుండఁ జిఱుకప్ప
కుం ద్రాఁచు పడగమేల్గొడుగు పట్టె
బలిసినతోడేలు చెలి కొండగొఱియలే
బుడుతకుఁ జెఱలాటములను నేర్పెఁ

తే. గీ. గౌశికుం డావిచిత్రముల్ గాంచి కాంచి
యాశ్రమావిష్కృతావిరోధాశయమ్ము
ననతికాలాత్తజైత్రయాత్రాశయమ్ము
నెమ్మది స్మరించి తల వంచి నిశ్వసించె. 22

సీ. పరిపచేళిమఫలప్రకరబృందిష్ఠనా
నానోకహావళీమానితమ్ము
ఫలమూలజలశీర్ణపర్ణసమీరణా
శనతపస్యాసిద్ధజనయుతమ్ము
నురుతమాసిశజపహోమపరాయణ
వైఖానసానేకవాసితమ్ము
దానవత్రిదశగంధర్వకిన్నరయక్ష
సిద్ధచారణగణాసేవితమ్ము

తే. గీ. వాలఖిల్యాదిమహానీశభాసితమ్ము
బ్రహ్మదేవర్షిజనతావిరాజితమ్ము
నమితమహిమాన్వితము వసిష్ఠాశ్రమమ్ము
నోజ దర్శించె గాధేయరాజమౌళి. 23

సీ. ఇరుచక్క నిలువుగా నెదిగి పై గుబు రైన
పోకమ్రాఁకులనడిపుంతనుండి
యెక్కనెట్టినవింటి నెనయుపందిరిఁ బ్రాఁకు
దాఁక తీవలనీడదారినుండి
గరువంపుగాలిచేఁ గాసంత యొరగిన
యనఁటిమేల్బోదెలయఱుతనుండి
యార్షకన్యకలచే నాసేచితము లైన
గొజ్జంగిపొదలబల్పజ్జనుండి

తే. గీ. త్రోవ నెదు రయి ప్రక్కకుఁ దొలఁగి నిలుచు
మునికుమారుల కెడనెడ మ్రొక్కు లిడుచుఁ
జనుచుఁ గౌశికపతి సతీసహితు మహితుఁ
గనె ననిష్ఠు వసిష్ఠుఁ బ్రాంగణమునందు. 24

తే. గీ. సంతతాభ్యాసవశమున శారికాళి
"స్వాగతం తే మహాశయ!" యనుచుఁ బలికె
స్వాగతికుఁ డౌచు దారతో సంయమియును
హర్షసంభ్రమ మమరఁగా నభిగమించె. 25

కం. ముని యిటు లభ్యుత్థానం
బొనరిచి తోడ్తెచ్చి చిఱుతపులితోలును గ
ప్పినప్రేపపుటాసనముం
గనుపఱిచి యటఁ వసింపఁగాఁ గోరె నృపున్. 26

మ. ఫలపుష్పాదిక మాఋషీంద్రుకడ సద్భక్తిన్ సమర్పించి చే
తుల జోడించి "నమో నమో భగవతే తుభ్యం; జని ర్మామకం
ఫలితం; గాధితనోభవోఽహ మిహ విశ్వామిత్రనామా కృపా
కలితం త్వా మభివాదయే" యనుచుఁ బల్కెన్ రాజు; తన్మౌనియున్.

తే. గీ. "స్వస్తి తే కుశికాన్వయసార్వభౌమ!"
యనుచు నాశీర్వదించె; నయ్యవనిపాలుఁ
"డంబ! వందతి తే సుతో" యనుచు నెరఁగ
నామె "వత్స చిరంజీవ" యని వచించె. 28

కం. తదనంతరంబ సంయమి
సదమలఫలమూల మొసఁగి సముచితరీతిన్
బొదలింప నాతిథేయము
ముదితుం డై కౌశికుండు మునిజనమణితోన్. 29

ఆ. వె. అమిత మైనశ్రద్ధ నధ్యయనించు నే
ఛాత్రసమితి వేదశాస్త్రములను
కలఁత వెట్టఁబోవు గద వాయుగంభీర
వేదు లాశ్రమాంతపాదపముల. 30

చ. నిలుచు నొకో నిదాఘముల నీరము కుల్యలలో సమృద్ధిగన్
ఫలములు కందముల్ దొరకునా కొఱ లేక; నిజాశ్రమావనిం
గలమృగముల్ ఖగంబులును గాలము పుచ్చునె స్వేచ్ఛ మై విని
శ్చలసుఖలీల హారిణిక శాకునికాచరణానభిజ్ఞతన్. 31

మ. కృప దైవాఱఁగ నాశ్రమాంతరమునందే యుంచి పోషించి మీ
రుపదేశించిన వేదశాస్త్రములయం దుద్దండతన్ బొల్చువా
రుపకారంబును విస్మరింపక కరం బుద్వాహనానంతరం
బెపు డైనం దమదివ్యసన్నిధికిఁ దా నేతెంతురా భక్తితోన్. 32

మ. ఫలమో మూలమొ నీరమో యనిలమో పత్త్రమ్మొ భక్షించి మా
నులు నిత్యం బరిపక్కముగ మిమ్ముల గంధూపింతురా? తీర్థయా
త్రల సేవింపఁగ మీర దేగు నెడ ఛాత్రశ్రేణి సంపూజ్యలి
వ్యాలఁతిం జేరఁగ నాతిథేయముల సంబాళింతురా దక్షతన్. 33

ఆ. వె. అనుచుఁ గుశలవార్త లాకాంక్ష సేయుచు
స్మేరవదనుఁ డైన వసిష్ఠమౌని
"పరమదక్షులౌ భవాదృశుల్ రక్షింపఁ
గొదవ యాశ్రమమును గదియఁగలదె?" 34

వ. అని బహుభంగుల సమ్మోదసీజాని నివతాళించునుడికారంపుసొంపు
గమగమింప నభినందించి వెండియు నిట్లనియె. 35

సీ. పరిశీలన మొనర్తువా పాలితులను నీ
ప్రాభవంబులపట్ల వఱలుభావ
మవలోడన మొనర్తువా భవన్మంత్రినై
శారద్యమాహాత్మ్యశక్తియుక్తిఁ
బూరించుచుందువా పౌరిపౌరిం గోశముల్
చతురంగబలము లస్తంద్రదీక్ష
జంకించుచుందువా శత్రులక్ మీవంక
సుంతైనఁ గన్నెత్తి చూడకుండ

తే. గీ. వృద్ధసేవకు నొక్కనికి పీడవుగద
గ్రామదేవత మీసీమఁ గదియదుగద
యన్నిట న్నిన్ను మీఱు నీయాత్మజతతి
వినయ మెసలార నిన్ను సేవించునుగద. 36

ఉ. నావుడు తావకీనకరుణాకలనక్ సకలానుకూల్యముల్
జేవ నెసంగు నంచు నృపశేఖరుఁ డెంతయుఁ బల్కె నమ్రుఁ డై

యీవిధి సత్ప్రసంగముల నిర్వురుఁ గాలము పుచ్చి రాదటన్
బోవ ననుజ్ఞ వేఁడె మునిభూషణుఁ గౌశికుఁ డల్ల లేచుచున్. 37

చ. చిఱునగ వంకురింపఁగ వసిష్ఠతపస్వి నృపాలుఁ గాంచి "యో
నరవర ! నీవ యీవిధి ననం దగునా ? యిట మామకాశ్రమాం
తరమున సర్వసైనికయుతమ్ముగ విందుల నారగింప కే
మఱలుట మేరలా ?" యనుడు మానవనాథుఁడు నవ్వి యి ట్లనున్.

ఉ. "అక్కట ! తావకాజ్ఞ కెదురాడఁగ జంకెద నో మహాశయా !
యిక్కడికందమూలచయ మే క్రియ మాకు రుచింపనేర్చు మీ
రిక్కరణిం గృపం గురియుటే బహుభాగ్యము; సర్వభోజ్యముల్
దక్కినయట్టులే కడు నెదం దలపోయుదుఁ బోయివచ్చెదన్". 39

చ. అన విని తా నరుంధతీముఖాంబుజముం దిలకించి మొల్కన
వ్వాను విపులీకరించి నృపపుంగవునిం గని మౌని యి ట్లనున్
"ఘనవిభవోన్నతా ! కుశికనందన ! మీరలు మీబలంబులం
దనియఁగఁ గోరుకొన్నగతిఁ దద్దయుఁ బెద్దగ విందు సేయుదున్" 40

చ. అనవుడు గాధినందనుఁ డనర్గళవిస్మయ మంది చిత్రముం
గనియెదఁ గాక యంచుఁ దనకంచుకిచేఁ బిలిపించె సర్వవా
హినిని గుమారయుక్తముగ; నెందును బాచనధూమవాసనల్
గనుపడకున్కి మౌనికృతకక్రియ కెంతయు నచ్చలించుచోన్. 41

మ. తనయిల్లా లరుదెంచి "సర్వమును సిద్ధమ్మయ్యె వేవేగ భో
జనముల్ సేయఁగ లేవవచ్చు" నన విశ్వామిత్రుఁడున్ వేగిరిం
చెను వాచంయమి బంధుతాసుతహితశ్రేణీయుతుండై; భూవిభుం
డనుమానించుచు నింద్రజాలపటుమాయాముగ్ధునట్లేగుచున్. 42

ఉ. సారెకుఁ జౌకళింపఁగ దృశల్ దిశలందుఁ గుమారబాంధవుల్
చేరువ వెంట నంటఁగ వసిష్ఠమునీంద్రుఁడు దారి సూపఁగాఁ

జేరె నరేంద్రచంద్రముఁ డుశీరమనోహరకాయమానవి
స్తారనివారితాతపవిశాలతదాశ్రమవాటికాతటిన్. 43

తే. గీ. అచ్చట యథార్హవైఖరి నాశ్రమాగ్ర
సూనుసంతతి మర్యాదఁ జూపుచుండ
దళముఁ గొనియున్న నైజయోధతతిఁ గనుచు
నేగె సుతయుతనృపతి మునీంద్రు వెనుక. 44

శా. అక్షయ్యంబుగ మాకు బాలుఁ డొకమం దందిచ్చునీరంబుచేఁ
బ్రక్షాళించి పదాంబుజాతముల విశ్వామిత్రభూనేత య
ధ్యక్షించెన్ ధృతిశాతమంజులమకూలాశోభినై పీఠికన్
ద్రాక్షావేల్లితకాయమానమధురాధస్తాన్మహావేదికన్. 45

మ. వరుసన్ శాకము లావపచ్చడులు సూపం బాపముల్ గారెలుం
బరమాన్నంబును లడ్డువంబులును నొబ్బట్లప్పళంబుల్ వరా
తిరసంబుల్ పులిహోర బూరియలుఁ గ్రొందేనెల్ కజాయంబులో
గిరముల్ దప్పళముల్ ఘృతంబును దధిన్ క్షీరంబుఁ బానీయముల్.

కం. వడ్డించెం బలుమఱుఁ గే
లొడ్డుచు వల దనుచుఁ బలుకుచున్నను నుడులన్
సడ్డ గొనసర్పక సుంతయు;
గడ్డుగొనుచు మౌనిబాలకప్రకరంబుల్. 47

శా. "శ్రాంతా భో నితరాం విదేశగమనై ర్జన్యై శ్శ్రమై ర్భుజ్యతాం
సంతోషో" యంచు నరుంధతీసతి మహాశాంతిం బ్రచారించుచున్
బంతుల్ దీరిచి యున్నవారలను సంభావించుచుం బల్కునై
జాంతేవాసుల నెచ్చరించుచుఁ బదార్థానీకముల్ నింపుచున్. 48

సీ. పెనులడ్డువంబును గాని చేతి నొక్కండు
తనయూలిపూపమన్నను దలంచెఁ

బళపళ విఱిచి యప్పడముల నొక్కండు
తననాఁతికఱకుమాటను దలంచెఁ
జక్కెరచిలుముక్కఁ జప్పరించి యొకండు
తనయింతితియ్యమోవిని దలంచెఁ
బూతరేకులడాలుపోలుపుఁ గాంచి యొకండు
తనచెలితళుకుఁజెక్కును దలంచె

తే. గీ. నిటులు మంపిల్లి బాళి నొక్కింతసేపు
తెలిసి పూతాశ్రమస్థితిఁ దెలిసి యూర్ష
దారసాన్నిధ్య మపరాధ మూర ! యనుచు
వారు చింతించి యాహార మారగించి. 49

ఉ. లేచి కఠోరగార్భిణములీల గమించిరి గట్టుగట్టునం
ద్రేఁచుచుఁ బొన్నగున్నలమదించిననీడల విశ్రమింపఁగన్
రాచకొలంబుశో నిచట రాజును నంతకుమున్న లేచి పు
ష్పాచితవల్లివేల్లితము నైనకురాళమునందు వేదికన్. 50

కం. ఆనుకొని నిల్చి మునిఁ గని
మానసఖేలన్మహానుమానము వాయం
గా నిట్లు వలికె నధికత
రానందవికస్వరాననాంబుజుఁ డగుచున్. 51

మ. "చవితాలింపులతావు లేయెడలఁ బంచారింపఁగాఁ బోవు ధూ
మవితానమ్ములు ముమ్మరించి దివి సంబంధింపఁగా బోవు తా
నివతాళింపఁగఁ బోదు వంటకము స్వామీ ! యెట్లు తెందేపలై
యవతారం బొనరించె నీకరణి భోజ్యంబుల్ నిమేషంబునన్". 52

చ. అనఁగ జగాపసాళినగ వాననసీమఁ దురంగలింపఁగాఁ
బనితనిజాశ్రమాంతికగవాదనివంతకుఁ జూచి యుచ్చకై

స్వనమున "నొక్క-మా ఆటకు వచ్చెదవా? శబళా!" యఁటంచు న
మ్మునిమణి పిల్చె; గాధిసుతు మోమున నివ్వెఱపాటు పాటిలన్. 53

కం. పిలిచినపిలు పింకను శ్రుతి
బిలముల గిలిగింత వెట్టి పెట్టకమున్నే
కులుకుటొయ్యారపు నడతోఁ
గలకలలాడుజగా మొగ మ్మురళింపన్. 54

సీ. మునిపుత్రు లేరి కొమ్ములకుఁ గట్టినపాల
పిట్టలయొఱకలపింజె సెదర
ముంగాళ్ళ రెండువైపుల నూగులాడుచు
డాలుజొబ్బిలు గంగడోలు గదుర
గిలిగిచ్చకాయలం గలిపి గ్రుచ్చి యమర్చు
నలరుదండలు మెడం గిలుకుమనఁగ
నలయరుంధతి కేల నలఁదినపసపుపై
నునుచుకుంకుమబొట్టు మినుకు మనఁగఁ
తే. గీ. గునుకుపరుగున వచ్చి యమ్మునికిఁ జెంతఁ
జనవు పాతరలాడఁగా సంవసించె
మోర పై కెత్తి యాతనిబుజము నదిమి
కామధేనువు కడుపారఁగన్న శబళ. 55

ఉ. అప్పుడు స్వర్గవీతనయ నాదరముల్ దయివాఱ దువ్వుచుం
జెప్పఁదొడంగె నీవిధి వసిష్ఠతపోనిధి దానిఁ జూపుచున్
"దొప్పలుదోర లై తగు చతుర్విధభోజనముల్ సృజించి నే
డప్పన మాచరించిన మహామహిమాన్విత యీమెయే సుమా. 56

ఉ. మేము నిమిత్తమాత్రులము మీయభినందనభాష లందఁగా
నీమెయె పాత్రురాలు ధరణీశ్వరశేఖర! మున్నొకప్డు డా

కామగవీమతల్లిని నికామము గొల్చి ప్రసన్నఁ జేయ నే
మేమియొ బాసలం గొనుచు నీయమ నీయఁగలేక యిచ్చెఁ దాన్."

కం. కర మిక్కరణిఁ బ్రమోదము
కెరలన్ ముని నైజనైచికీపరభాగం
బెఱిఁగింపఁగ నరపతి యనె
దురాశ లెదఁ బుట్టి పెరిఁగి దుడుకై దుముకన్. 58

మ. "మునిలోకాగ్రణి! యొక్క కోరికను మోమోటంబుచే విన్నపం
బొనరింపన్ వెనుదీయుచుంటి హృదయం బూటాడఁగా" నంచు న
ల్లనఁ గాసంత మొగమ్ము వంచి నెఱి కేలం దార్చి నిట్టూర్చి లో
ననుమానించుచు మిన్నకుంటయుఁ దగీయవ్యగ్రతాలోకి యై. 59

కం. సందియము కొంత నెమ్మది
దండడి వెట్టంగ మౌని తల యూఁచుచు మో
ముం దిలకించుచుఁ బల్క న
రిందమను నృపాలు నెచ్చరింప నతండున్. 60

శా. మీమాహాత్మ్య మొకండె చాలు జగతిం బెంపన్ యమింపన్ ముని
స్వామీ! వేఱుగ సాధనాంతరము సంపాదింపఁగా నేల? మీ
సామర్థ్యంబును డాగురించి శబళన్ శ్లాఘింతురే కాని సత్
ప్రేమాసారము నాపయిం జిలికి నన్ బ్రీణింపు డీయావుచేన్. 61

ఉ. రాజతశైలరాజముఁ బరాజితముం బొనరింపఁజాలు వి
భ్రాజితసద్గవీచయము వందలు వేలును లక్ష లిచ్చెదన్
వ్యాజము లేక మీ రొసఁగువత్సముఁ గంటికి ఱెప్పవోలె నేఁ
బూజ లొనర్చుచున్ మనుతుఁ బొందుదు శాశ్వతకీర్తిసంపదల్. 62

ఉ. నా విని యావసిష్ఠమునినాయకుఁ డాతనిమోముఁదమ్మిలో
దీపసముం గనుంగొని యదీనభయంకరదుర్నయాతి వే

లావిల మా తదీయహృదయాంతరభావము నాకళించి యీ
వావిరిగా నృపాలుఁ గని పల్కెఁ బ్రశాంతత జాలువాఱఁగన్. 63

ఉ. ఉత్తలపాటు మాని మది యోచనసేయు మొకింతసేపు రా
జోత్తమ! యుక్తమో యిది యయుక్తమొ పాక్షికధీ శమింపఁగా
నుత్తమగోసహస్ర మటు లుంచు చిరత్నసురత్నరాశి నా
యెత్తునఁ బోసినన్ విడుతునే? శబళం బలుమాట లేటికిన్. 64

శా. హవ్యంబున్ బలి యగ్నిహోత్రములు స్వాహాకారముల్ హోమముల్
గవ్యంబున్ వివిధైకవిద్యలు వషట్కారమ్ము నీజీవయా
త్రావ్యాపారము సాగుచుండుటకు నాధార మ్మిదే; బ్రాహ్మణ
ద్రవ్య మ్మేల పరిగ్రహింపఁ దలఁ పో ధాత్రీతలాధీశ్వరా! 65

చ. ముని యిటు వల్కఁ గౌశికుఁడు మో మొకమాఱుగ జేవుఱింపఁగాఁ
గనుఁగొనలందు గెంపు దొలఁకన్ బొమలన్ ముడివైచి "యో తపో
ధన! ఘనధర్మవేదులు గదా యిటు మీరలె మేరమీఱఁగా
నను వాకొ! రత్న మీశబళ యా నృపుఁ డారయ రత్నహారి యా.

కం. అది యటు లుంచుము మునిజన
పదశాంతికి భంగ మేల పంచారింపన్
మొదవులు రథగజహయసం
పదలం గొని యిమ్ము శబళ నైళమ యనుడున్. 67

మ. ఇదియే నారతనం బనారత మిదే యీవైదికాచారసం
పదకున్ మూల మిదే ధనం బిదియె సర్వస్వ మ్మిదే జీవితం
బిదియే దర్శము పూర్ణమాస మిదియే యజ్ఞం బిదే నీవదా
వదరల్ చాలును దీనిఁ బాసి యెటు నిల్వంజాలుదున్ మేదినిన్.

చ. తనతనయుం గనుంగొనఁగ దైవతలోకగవీమతల్లి మా
మునిజనవాటిఁ జేర నెటు మోమును జూపఁగలాఁడ? నేది నా

తనయ యటంచు న న్నడుగ "దానము నిచ్చితి నొక్క భూమిపా
లున" కను మందువా చెప్పుము లోలత మానుము దీనిపై నృపా !

ఉ. ఎన్నియొ యాలమందల నిఁ కెన్నియొ కండనుపట్టు నేనుఁగుం
గున్నల నిచ్చెదన్ మణులఁ గుప్పలు వోసెద నంచుఁ బల్కె దీ
విన్నియు నా కిదే యొసఁగ దే? యిది మీ కిడి వానిఁ గొంట చే
వెన్న గిరాటవైచి తనవ్రేలిని నాఁకినజోక గాదొకో. 70

తే. గీ. ఆత్మవంతుల కనవద్యయశము వోలె
శబళ మా కెంతయేనియు శాశ్వతమ్ము
విడువఁగా లేను విడువంగ వీలు కాదు
విడువ ముమ్మాటికిన్ నుడుల్ వేయు నేల ? 71

చ. అని మొగమోట వీడి ముని యాడినయానుడి కాగ్రహించి మో
విని మునిపంట నొక్కి యతివేలకషాయవినిశ్చలేక్షణం
బును బ్రసరింపఁజేసి శిరముం గదలించి భుజంబు నప్పళిం
చెను నృపమౌళి యాశబళశృంగముఁ జివ్వునఁ బట్టి లాగుచున్. 72

కం. ఇటు సాహసించు నృపు ముని
తటు కాపడి చూడఁ గ్రేళ్లు దాఁటె శబళ త
త్పటుముష్టిన్ విదళించుచు
విటతటముగ నాశ్రమాంతవీథుల నంతన్. 73

మ. జననాథాగ్రణి వేగిరింప శబళన్ సంధించి బంధింపఁగా
వెనువెంటన్ రయమార దూసిరి భటుల్ వేమాఱు గద్దించుచున్ ;
ఘనకోలాహల మాలకించి కని సాకల్యంబుగా భీతిమై
ననిమేషత్వము దాల్చె నాశ్రమజనం బాబాలగోపాలమున్. 74

ఉ. తాలిమి వింత సేయఁగఁ గృతజ్ఞత నీగతి సూపె నమ్మ! భూ
పాలకుఁ డెంతకైనఁ దగువాఁ డిది నిక్కము తిన్న యింటికా

సాలను లెక్కసెట్టి ననుసామెత పేనికిఁ జెల్లు నెట్టిదు
ష్కాలము దాఁపురించె నని కాంతలు దూఱుచు నారటింపఁగన్. 75

ఉ. పొంగులువారు నశ్రుజలపూరము సారెకు నారచీరముం
గొంగున నొప్పుచుఁ శబళకోసముఁ జూచుచు నాత్మపర్ణశా
లాంగణతుంగసీమ నడయాడుచు నాఁగుచు నాయరుంధతీ
మంగళమూర్తి వాల్చె మతిమాలినమాదిరిఁ దత్తరించుచున్. 76

చ. చన ననువైనత్రోవ వడి చంగున దాఁటుచుఁ బట్టువడ్డచోఁ
బెనఁగుచు నిగ్గుచుం గిరుసు వెట్టి వడిఁ దుసికిల్లి పాఱుచున్
వనటను జెందుచున్ శబళ వచ్చి నిలంబడె నెట్టకేలకుం
దనతనువే యెఱుంగక వితాకున నున్నవసిష్ఠుచెంగటన్. 77

ఉ. వచ్చినదాని హాని నరపాలుఁడు దచ్చనలాడుచుండఁగా
గ్రుచ్చి కవుంగిలించుకొని గొబ్బున జొబ్బిలుకంటినీటిచే
ముచ్చిలిగుంట నించుటయు, ముగ్ధగపేసుత జాలి గ్రాలఁగా
నెచ్చిననెంజిలిం బలికె నీగతిఁ బెంచినసత్తపస్వితోన్. 78

ఉ. "ఎంతయు మాలిమిన్ విడిచి యీజనపాలకిరాతుచేతిలో
నుంతువె నన్ను నిన్విడిచి యుండఁగ నోపుదునే మహాత్మ! యా
వంతయుఁ దప్పు సేయను గదా బరువైతినె నేఁడు నీ" కనన్
గొంతుక గద్గదస్వనము గుల్క వసిష్ఠుఁడు వల్కె నీక్రియన్. 79

ఉ. "బల్లిదుఁ డీయిలావలయపాలుఁడు సేనల గండుమీఱి తాఁ
ద్రుళ్ళుచు నున్నవాఁ డితనిఁ దోలఁగలాఁడనె? వెఱ్ఱితల్లి! నే
చెల్ల! యిఁ కేమిసేయుదునె? చేష్పడుచుం గనుఁగొంటఁ దక్క" నాఁ
జల్లనిపల్కులన్ శబళ సంయమితోఁ నిటు లాడెఁ గ్రమ్మఱన్. 80

ఉ. "పాలకపాళి చూడ బలవంతుఁడె యయ్యెడుఁగాక సేనలం
గ్రాలుట; బ్రాహ్మణుండు నృపకంటెను దా బలవత్తరుండు వే

యేల వచింప బ్రహ్మబలమే బల మయ్యెది నాకుఁ గూర్పఁగాఁ
బోలదె? యీదురాత్మునిచమూతతి గూలదె? యూచముట్టుగన్."

కం. అన విని మునిజనమణి లోఁ
గనికరము కరమ్ము గదురఁగా నాశబళన్
దన కేల నిమిరి బల మిడెఁ
జనె నదియు సృజింపనవ్యసైనికచయమున్. 82

మ. జవ మేపారఁగ బల్మిఁ బట్టఁగ భటుల్ సంధించుటం గాంచి వేఁ
జెవులన్ రోమచయమ్ము నిక్కి-పొడువన్ శీర్షంబు మన్నానఁగా
మెవులన్ వంచి వినీలవాలమున డాల్ మింటం బిసాళింప స
ర్వవిధిన్ "బు"స్సనిజుం కైనై చేనది "యంబా" యంచుమాఁ గ్రోమ్మియఁగన్.

మ. ప్రతిరోమంబునఁ బప్లవప్రకరముల్ ప్రాదుర్భవించెం గృధా
చితనానాయుధపేధిశోఁ; గడఁగి యాశ్లేషించి యమ్మేదినీ
పతిసేనానివహమ్ములం బొదివి చంప న్నాగెఁ గ్రేడించి; త
ద్గతి నీక్షించి నృపాలుఁ డుద్దవిడి హుంకారించి యుగ్రాకృతిన్. 84

మ. పవనానూనజవమ్మునన్ రథము వోవం దున్మి తూఁటాడెఁ బ
ప్లవరాజిన్ వినిశాతసారశరజాలంబుం బ్రయోగించి; పూ
నివరుం డంతట బ్రహ్మతేజమును సంధింపన్ శకానేకముల్
యవనానీకము లుద్భవించె శబళాహంకారమంద్రధ్వనిన్. 85

శా. పంచారించునపీనసేనఁ గని విశ్వామిత్రభూజాని సా
రించెన్ దివ్యమహాస్త్రసృష్టి; ముని పూరించెం బునశ్శక్తి; గ
ర్జించెన్ గోసుత మాటిమాటికి; జనించెన్ వీరసైన్యంబు; ఘో
షించెన్ దిక్తటి; యాశ్రమార్షతతి హర్షించెం దుటాయించుచున్.

కం. ఉదయించిరి పప్లవతతి
పొదుగున; మ్లేచ్ఛాళి రోమముల; శకయోధుల్

గుదమున; యవనులు యోనిం
గదుకొనుహుంకారమందుఁ గాంభోజభటుల్. 87

ఉ. వారలు సింహనాదము లవారిగఁ జేయుచు నీరసించుచున్
సారెకుఁ గప్పుదెంచుచు నిశాణితశాతకృపాణసద్ఘృణీ
సారణి మింట జాలుకొనఁ జయ్యనఁ బైఁబడి మొక్కపెట్టునన్
మారణముం బొనర్చి రలమానవనాథు నశేషవాహినిన్. 88

చ. కనుఁగొని సైన్యమారణముఁ గారణ మామునిదీని కంచు నె
మ్మనముల నెంచి భూవరకుమారు లహంయువు లౌచు నెంతయున్
గనలి వసిష్ఠసంయమిమిని నాశ మొనర్పఁగఁ గమ్మిరింప "హుం"
మ్మని యదలించి తాపసి యమాలయవాసులఁ జేసె వారలన్. 89

కం. వ్యాకులితుండై ఋషిభ
ర్త్సీకృతసంతానరాశి శీలించి ధరి
త్రీకాంతుఁడు జీవచ్ఛవ
మై కడుఁ గల్లువడె నిలువ నవశత మీఱన్. 90

తే. గీ. నిర్హృతనిశాతదంష్ట్రాహినేత వోలె
సైంహికేయగ్రహగ్రస్తసవిత వోలె
ఛిన్నపక్షతియుగళవిష్కిరము వోలె
ముక్తదర్పప్రభాగతిం బొలిచె నతఁడు. 91

ఉ. ఇట్టులుఁ ద్రోఁపులాడుచు ఋషీంద్రునిశిష్యగణంబు కేకిసల్
గొట్టుచుఁ గేకరింపఁ గనుఁగోనల రోషకషాయదీధితుల్
మిట్టిపడంగఁ గాంచుచు గమించె నృపుండు హతావశేషులై
చెట్టును బుట్టఁ బట్టి తనసేనలపట్టున కెట్టకేలకున్. 92

చ. తమదెస కేగుదెంచునృపతల్లజునిం గని దీనదీనమై
నమితశిరస్కమై పలుక నాలుక రాక సళించునల్పసై

న్యమున హతావశేషు లగునందనులం గమిఁ జూచి హర్ష సం
భ్రమములఁ గౌఁగిలించుకొని వాకొనె రాజవతంస మీక్రియన్. 93

ఉ. "సేనలు గూలె సూనులు నశించిరి మిక్కిలి బ్రాహ్మణప్రభా
వానలమూలహేతువున; నగ్గల మౌ తప మాచరించి యీ
శానుఁ బ్రసన్నుఁ జేసికొని సర్వమహాస్త్రములన్ గడించి యీ
హాని బలాత్కృతిం బెలుకుమార్చి పురంబునఁ గాలు వెట్టెదన్. 94

కం. కాలహరణంబు సేయం
బోలదు సాంప్రతమె పురికిఁ బొం డేలిక యై
పాలింపుఁడు మీలో నొకఁ
డాలోచింపకుఁడు కదలుఁ డరుగుఁడు చనుఁడీ. 95

చ. అనుచు గిరుక్కునన్ మఱలి యాత్మకుమారులయియ్యకోలునూ
టను జెవిఁ బెట్టకే చనె హుటాహుటి గాధినరేంద్రసూతి వెన్
వెనుకకుఁ జూడకుండ నతివేలజవమ్మునఁ గ్రోధమున్ నిరా
సనమును మచ్చరంబును నెసంగ హిమాలయపార్శ్వసీమకున్. 96

ఉ. అచ్చట గాంగనిర్మలజలాంతరమందున స్నాతుఁడై ప్రసూ
నోచ్చయభాసమాన మగు నొక్కమహీజముక్రింద గండశై
లోచ్చతటిన్ వసించి కుశికోద్వహమౌళి యహర్నిశంబు నా
చిచ్చఱకంటివేల్పు దరిసింప రచించె మహాతపస్క్రియన్. 97

సీ. ఏకలోచనమునందే కుస్తరించిన
గొనబుకాటుకరేక కొప్పరింప
ఏకకపోలమందే విలిఖించిన
మకరికాపత్రంబు మల్లడింప
ఏకవక్షోజమందే సముద్ధూళించు
గంధసారాంకమ్ము గమగమింప

ఏకపాదాబ్జమందే పాదుకొల్పిన
కులుకుబంగరుటందె గోడగింప

తే. గీ. పూపజాబిల్లి కేయెండఁ బుక్కిలింపఁ
గొసరుచదలేరు తుంపురుల్ గులకరింప
దీక్షఁ బూని తపించుగాధేయనృపున
కర్ధనారీశ్వరుండు ప్రత్యక్షమయ్యె. 98

శా. ధ్యేయం బొక్కఁడుఁ దక్క నన్యమును బుద్ధి న్నిల్పఁగాఁబోనిగా
ధేయుండున్ శిథిలీకరించుచు సమాధిన్ భక్తి సంధిల్లఁ జే
దోయిన్ మొగ్గ నొనర్చి "మా మవ నమ స్తుభ్యం మహాదేవ! శం
భో" యంచుం ద్రిపురాసురారిచరణాంభోజమ్ములన్ వ్రాలఁగన్.

చ. చిఱునగ వేసరేగ శశిశేఖరుఁ డాదరమార నాధరా
వరుఁ గని "యోకుమారవర! బాఢతపోనియతిం జరించి యీ
సరణిగ మైజగాహువు జాగరలాడఁగ నేల? చాలు వే
వరముల నిచ్చెదం గొనుమ వాంఛితమున్ విశదీకరింపుమా." 100

కం. అనవుడు నస్త్రాసాదన
ఘనతర్షణుఁ డగుచు హర్షకర్షితమతియై
యనె నారాజర్షి పునః
పునఃప్రణతి సంతరించి భూతేశునితోన్. 101

శా. "ఏపు న్మీఱెడు తావకీనకరుణాహీనామృతాసారమున్
నాపై జోరునఁ గ్రుమ్మరించితివి ధన్యత్వంబు ప్రాప్తించె సాం
గోపాంగోపనిషద్రహస్యకలనాయుక్తమ్ముగా నీఁగదే
సోపర్వాసురయక్షసంయమిగతాస్త్రవ్రాత మత్యంతమున్." 102

మ. అని యర్థింప దయాలవాలుఁ డగునాద్యానాయకుండున్ "తథా"
స్తని దీవించి తిరోహితుం డగుడుఁ; బర్వాషాంపతిప్రక్రియన్

ఘనవీర్యాన్వితుఁ డై నృపాలముని వేడ్కం బొంగి మిన్నంటుచుం
జనె వాసిష్ఠతపోవనావనికి హింసాలాలసస్వాంతుఁ డై. 103

కం. కడ తేఱు నేఁటితో నా
కొడుకులఁ దనపొట్టఁబెట్టుకొనినచెనఁటి యా
జడదారి యనుచు నామడ
యడుగుగఁ ద్వర నరిగి యాతఁ డాశ్రమముపయిన్. 104

మ. అభిమంత్రించి సమగ్రకోపకలనాహంకార మేపారఁగా
నభవాసాదితభీకరాఖిలమహాస్త్రాళిం బ్రయోగింపఁగా
నభమం దాశ్రమభూమియందుఁ బఱచెన్ నానాప్రకారంబులన్
సభయవ్యాకుల మౌచుఁ బక్షిగణముల్ మౌనీంద్రసంతానమున్.

సీ. కేల్దోయి మోడ్చి జుట్టి కెవ్వకెవ్వన నేడ్చు
పాపల నెద హత్తి పఱచువారు
అగమాగ్రశాఖల నారవైచినకావి
దోవతులం దీయఁ దొడరువారు
గోష్ఠమ్ములందు నాఘోషించుగోవుల
గ్రేవేయ మెడలింపఁ గడఁగువారు
స్రువకమండలుబృసీనవధవిత్రాదిక
ముల మూటఁ గట్టి కొంపోవువారు
తే. గీ. మౌంజి డిగజాఱి మోకాళ్ల మట్టుకొనఁగఁ
దడఁబడుచుఁ జాపచుట్టఁగాఁ బడెడువారు
నురక మతిమాలి యిటునటుఁ దిరుగువారుఁ
గాల నాశ్రమ మల్లకల్లోల మయ్యె. 106

ఆ. వె. ఆశ్రమాంతరోద్గతాక్రందనస్వన
మ్మాలకించి మించి యావసిష్ఠ

ముని తదీయహేతువును సమాకాంక్షించు
నంతలోన శిష్యు లటకు వచ్చి. 107

చ. మును శబళార్థమై తనచమూసుతులన్ బలి నిచ్చుకొన్న యా
జనపతి వచ్చి క్రమ్మఱఁ బ్రశాంతమహాశ్రమమెల్ల నాశనం
బొనరుచుచుండె మీ రటకు నొయ్యన వచ్చి నివారణం బొన
ర్పనియెడ నీరిణం బగుఁ గరం బని విన్నప మాచరింపఁగన్. 108

ఉ. క్రచ్చఱ బ్రహ్మదండమును గైకొని యమ్ముని యాశ్రమస్థలిం
బచ్చముపాడుసేయు నరపాలుకుఁజెంగట నిల్చి యిట్లనున్
నిచ్చలు లాల వోయుచు మునిప్రియపత్నులు పెంచుకొన్న యీ
పచ్చనిచెట్లగుంపుఁ గనుపట్టునఁ బాపఁగన్ను కుట్టెనా ? 109

చ. గొఱియకుఁ గొండ డీకొనెడుకోరిక లీరిక లెత్తెనా ? యుపా
వరుఁడు సపాత్రదానము సవారిగఁ జేసినవాఁడు; నీదురా
చరణము లీవసిష్ఠుకడ సాఁగవు; వచ్చినత్రోవఁ బట్టి వే
మఱలుము జీవితాశ యణుమాత్రము గల్గిన క్షత్రబంధుఁడా ! 110

కం. అనవుడు విశ్వామిత్రుఁడు
విని వికటక్రియ దలిర్ప వికవిక నగి తా
ననలాస్త్రము సంధించెన్
గొనయమున సమంత్రకముగఁ గుపితుం డగుచున్. 111

ఉ. తాపసపాళియున్ శమనదండసమం బగు బ్రహ్మదండముం
గోపముతోడ నెత్తి కనుఁగోనల నానలకీల గ్రాలఁగా
భూపతిపాంసనా ! పోగరుఁబోతుతనంబున కేమి ? క్షాత్రముం
జూపుము బ్రాహ్మవీర్యమును జూపెదఁ గాంచెదు తారతమ్యముల్.

చ. అనుచు వచింపుచుండ ననలాస్త్రము నాకుశికాన్వయుండు నై
చిన నది ధూమసంహతిని జిమ్ముచు నాశ్రమసీమఁ గ్రమ్ముచున్
గొనకొని మింట మంటలు రగుల్కొన నాల్కలఁ జాపి రాఁ దపో
ధనికుఁడు బ్రహ్మదండమున దాని వడిం గబళించి మించినన్. 113

సీ. వారుణశోషణస్థాపనమోహన
  గాంధర్వకాపాలకంకణములఁ
పాశుపతైషీకపైనాకపైశాచ
  హయశిరోమథనవాయవ్యములను
గంకాళజృంభణకాలచక్రక్రౌంచ
  మానవరౌద్రైంద్రమౌసలముల
వైద్యాధరాశనివైష్ణవచక్రవి
  లాపనవజ్రసంతాపనముల

ఆ. వె. బ్రహ్మపాశకాలపాశవారుణపాశ
  శక్తియుగళధర్మచక్రములను
  గ్రుద్ధుఁ డగుచు విడిచెఁ గుశికాన్వవాయుం డ
  శేషితాస్త్రముల వసిష్ఠుపైన. 114

కం. ఆపోశనించె నద్భుత
  మాపాదించుచుఁ ద్రిలోచనాత్తమహాస్త్ర
  ప్రాపితతేజోలహరిం
  దాపసి గండుకొని బ్రహ్మదండముచేతన్. 115

చ. వితథం బైనమహాస్త్రసారగరిమన్ వీక్షించి గాధేయుఁ డా
  చితరోషానలదుర్నిరీక్ష్యుఁ డయి విక్షేపింప బ్రహ్మాస్త్రముం
  గుతలం బెల్లఁ జలించె బ్రాణితతి సంక్షోభించె నింద్రాదిదే
  వత లొక్కుమ్మడిఁ బిచ్చలించిరి భయభ్రాంతాత్ములై రౌరగుల్.

తే. గీ. వారు వీ రని వేర్వేఱఁ బలుక నేల?
  లోకములు మూఁడు నల్లకల్లోల మందె
  బ్రహ్మదండమ్ము చేతఁ దపస్వి దానిఁ
  గూడ నవలీలఁగా గుటుక్కునను మ్రింగె. 117

మ. గిళితాస్త్రుం డగునామహర్షి మెయి నగ్నిజ్వాలమాలావళుల్
  వెలిఁగెం జాలఁగ రోమకూపములఁ దద్భీమాకృతిం గాంచి బె

గ్గిలి "తేజం బుపసంహరింపుము త్రిలోకీమంగళార్థంబు నీ
బలసంభార మమోఘ" మంచుఁ దపసుల్ వందించి ప్రార్థింపఁగన్.

కం. వాసిష్ఠాననసీమన్
భాసించెఁ బునఃప్రసన్నభావచ్ఛవి; ని
శ్వాసించుచుఁ జిత్తమ్ముఁ క
శాసింపఁగఁ గుశికకులలలాముఁడు నిలిచెన్. 119

ఆ. వె. బ్రహ్మదండ మొండె పర్యుదాసించెను
సకలదేవతాస్త్రసమితి నౌర!
క్షాత్రబల మదేల కాల్పనా తద్బ్రహ్మ
బలమె బలము విష్టపత్రయమున. 120

కం. అతినిర్మలమతి నై సం
తతమున్ బ్రహ్మత్వకారణం బైనతపో
గతి మెలఁగెద నంచు విని
శ్చితుఁ డై నిజరాజధానిఁ జేరఁగ నరిగెన్. 121

మాలినీవృత్తము. సకలధరణినాథాస్థానవిద్వజ్జనాంతః
ప్రకటితసుకవిత్వప్రాభవాభోగభోగా!
కుకవినికరదుర్వాగ్గుంఫితగ్రంథదారు
క్రకచనిరుపమానాఖండపాండిత్యనిత్యా! 122

గద్యము.

ఇది శ్రీహరిహరదేవదయాపాంగప్రసారణసమాసాదితోభయభాషాకవితా
రచనాప్రవీణ, కాకరపర్త్యుపనామకకాశ్యపసగోత్రపవిత్ర, బాప
నార్యభిషక్సార్వభౌమపౌత్ర, వేంకమాంబావేంకటరాయ
సుధీపుణ్యదంపతితనూజ, కవికంఠీరవ, కవిమూర్ధన్య
మహాబిరుదవిరాజమాన, కృష్ణశాస్త్రిప్రణీతం బైన
కౌశికాభ్యుదయమహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము

హరిహరదేవాయ నమః

# కౌశికాభ్యుదయము

## తృతీయాశ్వాసము

కం. శ్రీరమణీయమణిద్యుమ
హారజతారచితనఖలితాతతకవిమం
జీరవిరాజితచరణాం
భోరుహ! శ్రీపాదకృష్ణమూర్తికవీంద్రా! 1

తే. గీ. అవధరింపుము దశరథక్ష్మాధినాథ
నందనుఁడు రామునకు శతానందుఁ డిట్టులు
మధురమధురవచోనిగుంఫనము లురల
గాధితనయోత్తమోత్తరగాథ వినిచె. 2

శా. ఘూసీశానహృతాస్త్రసారుఁ డగుచున్ మాంద్యమ్ముతోఁ జేరి స్వ
స్థానీయమ్మును గౌశికుండు గతవృత్తాంతం బశేషం బహూ
త్యానేకంబునకుం గథించి భవితవ్యాంతర్యముం దెల్పి తా
వానప్రస్థమునం జరింపఁ దలఁపున్ వాచించి దేవేరితోన్. 3

ఉ. పాలనకార్య మొక్కసుతుపై నిడి విశ్వసనీయమంత్రివ
ర్యాళిని రాజ్యరక్షణకు నై నియమించి శుభైకకాలసం
శీలన మాచరించి మహిషీచతురాత్మజయుక్తుఁడై యవా
చీలసమానదిక్తటి వసించి తపించె నచంచలస్థితిన్. 4

కం. కందఫలంబుల నివ్వరిఁ
దెం దేపలుగా ఘటింప దృషన్నేత్రహవి
ష్యందమహారఘులు మధు
ష్యందుం డహరహము పక్వశాలం గాచున్. 5

సీ. తానె మార్జనిని జేతం బూని వేదిక
నల్లనల్లన నద్ద మట్టు లూడ్చు
జలకమ్ము సవరించి సెలయేటి తెలినీటి
నొకబిందెతోఁ దెచ్చి యొద్ద నుంచుఁ
గొదమతుమ్మెదడాకకుఁ లెక్క సేయక
పూజాసుమంబులఁ బుణికి తెచ్చు
లేటికూనలయెంగిలి నెఱుంగనట్టిద
ర్భలచివుళ్లను గోసి పజ్జఁ దాచ్చు
తే. గీ. లోప మేమున్నదో యని లోఁ దలఁచుచుఁ
జేతుల న్మోడ్చి తల వంచి చెంత నిలుచుఁ
బ్రతిదినంబును గాధేయుపట్టమహిషి
భర్తృసంతృప్తి తనశ్రమం బాఱఁద్రోల. 6

ఉ. వర్షసహస్ర మీఁగతిఁ దపశ్చరణంబున నేగుచో మహా
హర్షము రాయిడింపఁ జతురాననుఁ డచ్చటి కేగుదెంచి "రా
జర్షివి నేఁటితో నయితి వీవు నరేంద్రమణీ! వృథాతప
స్తర్షణ మేల చాలు" నని సాఁగెను సత్యపథానుసారి యై. 7

మ. విని పైతామహవాగసారసరణిం బ్రశాంతివేలానతా
ననరాజీవముపైనఁ గోపమును సంతాపమ్ము దీపింపఁగాఁ
"బని తానూనతపోనిధాను నను సంభావింత్రు రాజర్షిగా
మునులున్ దేవగణంబు లింతయె ఫలంబుల్ మత్తపశ్చర్యకున్." 8

కం. అని గొణుగుకొంచు వెండియు
జనపతిముని కౌశికుం డసామాన్యతపో
ధనఘనతరసరణిం దా
నినుమిక్కిలి సంచరించె; నిది యిటు లుండెన్. 9

ఉ. మానితశాసనుం డనుపమానయశోవిశదప్రభుం డయో
ధ్యానగరీవసుం డపరిహార్యతపోవిజితాహితేశపం
చాననుఁ డార్యవర్యుఁడు త్రిశంకునృపాలకుఁ డొక్కనాఁడు స
మ్మానితుఁడై వసిష్ఠమునిమండలమండనుఁ జేరి యిట్లనున్. 10

మ. "గురుదేవా! భవదీయశిష్యుఁడు త్రిశంకుం డొక్కవిజ్ఞప్తిఁ దాఁ
గరకంజంబుల మోడ్చి చేయుటకు సంకల్పించి యున్నాఁడు దే
వరయాజ్ఞం గొన వేచి యుండె" నన సంభావించి సమ్మోదముల్
కెరలన్ మానికులావతంస మిదె నంగీకారమున్ వాకొనన్. 11

చ. పునరభివాదనప్రకరమున్ మునిసింహున కాచరించి యా
జనపతి "శిష్యవత్సల! విశాలదయాకలనాలవాల! నే
ఘనవిధులన్ యజించి నరకాయముతో సురలోకముం జనన్
మనమున నెంచెఁ దావకసమంచితకారుణికత్వసంగతిన్. 12

ఉ. మీ కిటు విన్నవించితిని మేటిలులోలత నంతె కాని మై
త్ర్యావరుణభాగధేయములఁ గంటికి ఱెప్పఁగఁ గాచు మీకు నే
వాకొన నేల నయ్య? భగవానుఁడ!" యంచు వచింప నట్టహా
సాకలితాననాంబురుహుఁడై మునిపుంగవుఁ డానృపాలుతోన్. 13

కం. తల మీఱు కార్యభారముఁ
దలపెట్టితి వేల్పుప్రోలుఁ దనువునఁ జేరం
దలమే వత్సా! యెంతగఁ
దలఁక్రిందయినన్ వృథావిధానము లేలా? 14

చ. అన మొగ మింత చేసికొని యాజనపాలశిరోవతంస మా
మునిదెసఁ జూచి చూచి కను మోడిచి వేడిగ నిశ్వసించి నె
మ్మనమున నల్లిబిల్లి గొని మాటికి మాటికిఁ గక్కసించుకో
ర్కిని దమియింపలే కతనికిన్ సతి జేసి యవాచికిం జనెన్. 15

మ. అనుమానంబులు మానసంబునకు నాయాసంబుఁ గల్పింపఁ దు
త్తునియల్ సేయుచు వాని దీమసముచే; దూపిల్లుచున్ డెందమం
దనయంబుం దలపోసి మౌనికృతప్రత్యాఖ్యానమున్: బోయి కాం
చెను వాసిష్ఠకుమారులన్ వరతపోనిష్ఠాగరిష్ఠాత్ములన్. 16

కం. తతనయము వినయ మేకీ
కృత మై దైవాఱ మౌళికీలితకరుఁ డై
యతఁ డాత్మపురోహితసుత
శతమున కున్నతి నతించి సంతస మొదవన్. 17

మ. భగవంతుండు వసిష్ఠమౌని యనుకంపావృష్టిపాతంబుచే
తఁ గటాక్షింపకపోయె; మీ రయిన నన్ ధన్యాత్ముఁ గావింపరే?
వగలం ద్రుంపరె? పూన రారె యజనాధ్వర్యుత్వముం జూపరే
సుగతిన్; నన్ సశరీరిఁగాఁ ద్రిదివవాసుం జేసి రక్షింపరే? 18

మ. గురుదేవుండు వసిష్ఠసంయమికి మీకున్ భేద మావంతయుం
బరికింపం గలదే! సదా నిగమ "మాత్మాపుత్రనామాసి" యన్
పరమార్థంబును జాటదే వరకృపాపారీణు లై కావుఁడీ
శరణార్థిన్ మఱుమాటల న్నుడువ కాశాసింపుఁడీ శిష్యునిన్. 19

చ. గురులకుఁ బిమ్మటం గురులు కోవిదు లాశ్రితపక్షపాతులున్
సరసు లుదారమానసులు స్వాములు మీ రని సన్నుతించు న
న్నరవరుఁ గాంచి శాంతివచనమ్ముల నమ్మునిచంద్రపుత్రకుల్
చిఱునగవుల్ మొగంబుపయిఁ జిందులు ద్రొక్క వచించి రీక్రియన్.

మ. మతిమంతుండవు నీవ యీకరణి సంభాషింపఁగా నౌనె సూ
నృతపారీణ ! పురోధయున్ వరగురుం డిక్ష్వాకుభూపాలికిం
బితృపాదుండు వసిష్ఠసూని యొకఁడే వేయేల తద్వాక్యమున్
విత సేయం దరమే పురంబునకు వే వేంచేయుటే మేలగున్. 21

చ. తనువు ధరించియే యమరధారుణిఁ జేర నశక్య మంచు సూ
జనయిత శిష్యవత్సలుఁడు చాలఁగ యోచన జేసి చేసి వా
కొనియెఁ గదా తదాత్మజులఁ గోర నభీష్టము తీఱు నంచు నె
మ్మనమున నెంచితే ? యిటులు మాకును మాకును దంపి వెట్టెదే?

తే. గీ. జగతిలోపల సత్యానుసారి యగుచు
మునిజనానూనవాక్యంబు దనరుచుండుఁ
గాని మామకజనకవాక్యానుసారి
యై ప్రధావించు సత్య మ్మహర్నిశమ్ము. 23

ఆ. వె. గురులకెల్లఁ బరమగురుఁడౌ నరుంధతీ
వరునిపాదయుగమె పట్టుకొనుము
నిరుపయుక్తయత్ననియతిన్ విసర్జింపు
మతఁడు తలఁచుకొనిన నడ్డు గలదె ? 24

చ. అని మురళించుగౌరవసుతావళి నావళితావలేపగో
పనము రహింపఁ, గోప మొదవ బల్మిఁ దమించుచుఁ బుల్కపుల్కనం
గనుఁగొని జాజువాఱిన మొగమ్మును గన్పడనీక వంచి యి
ట్లనె నపలాపకైతవము లాముకొనన్ నృపుఁ డంజలించుచున్. 25

శా. ప్రత్యాఖ్యాతుఁడ నైతి మున్ గురుగురువ్యాఘ్రంబుచేతం బునః
ప్రత్యాఖ్యాతుఁడ నైతిఁ దత్తనయవారాహాళిచే నేఁడు నే
నత్యంతీనుఁడ నై భరింపవలసెన్ హా ! యింక గత్యంతరం
బత్యంతంబు; పురోహితాశ్రయము బాయం జింత ఱింపిల్లెడిన్. 26

ఆ. వె. ఆచరింపుఁ డయ్య యాత్మార్థము తపమ్ము
స్వస్తి మీకుఁ; బోయి వత్తు నయ్య!
యనుచు వింగడించి చనఁ దలారింపఁ బో
వనిరి మౌనిసూను లాగ్రహించి. 27

శా. "ఏరా! మానవనాయకాపసద! మ మ్మీలీల దూషింపఁగా
నో శేరితిగ వచ్చెరా? రవికులీనుం డౌదువే నీ విసీ!
నారం బెంతయు నేవగించుకొనఁ జండాలాకృతిం దాల్చి యూ
రూరం ద్రిమ్మరు" మంచు శాప మిడ రాజోత్తంసుఁ డుద్విగ్నుఁ డై.

తే. గీ. పంచకరపాటు లెదకోడఁ బరిచయింప
నేత్రముల నిశ్చలత్వంబు నిట్టనిలువఁ
గల్లువడియున్న నెమ్మేను గలఁతరింపఁ
బ్రతిమవలె బిమ్మిటి యొసంగఁ బ్రతివసించె. 29

కం. తనవంశమందు బొడమిన
జనపతి వాసిష్ఠఘోరశాపోపహతిం
గనె నని మనికితపడెనా
నినుఁ డపరాశఁ గమించె హృతతేజుం డై. 30

సీ. కొండకాలువనీరు గ్రుక్కెడు కతికి క్రోల్
పులి గుట్టపై నెక్కి కలయఁజూచెఁ
జెదరి బయళ్లఁ బచ్చిక మేయుహరిణముల్
క్రమముగా మంద నేర్పఱుచుకొనియె
ముస్తెలం దిని తిని మొగచాటుఁ గని కిటుల్
గునగునఁ గడు పీడ్చుకొనుచు నరిగెఁ
బుట్టతేనియ లాని పులిత్రేపు రవళింప
భాలూకములు కొమ్మఁ బట్టి కునికె

తే. గీ. బోరియ వెలువడి సారెకు మోర లెత్తి
నక్క లందంద నిలిచి సన్నాయి నూఁదె
జొబ్బిలురవాళి జీరుక సుతి ఘటించె
సంజ క్రొంజీఁకటులగుంపు పుంజికొనియె. 31

కం. జగతీతలసంగత ఘూ
జగానెఱిరువాణ మెడలె శాతతమమునన్
జగతీతలనాయకు మై
జగానెఱ్ఱువాణ మెడలె శాపముకతనన్. 32

ఆ. వె. మును పురోధ తన్ను మురళింప దక్షిణా
పథపథంబు నట్టుధరణివరుని
వెంట నంటి కుటికి వెలుపల నిలిచిన
సచివు లతని జేరఁ జనకమున్న. 33

సీ. జలతారుబైరవాసము జాఱి వేయిక
న్నులమోటముప్పటి నూలుకొనియెఁ
గేయూరభూషలు వోయి మాయనిత్రుప్పు
ముసురునాయసపుసొమ్ములు రహించెఁ
దతరత్నహారాళి యంతర్ధానమై మాగు
పడినచేలపుఁగోరపాగ యమరె
సంపెగనూనెచే జానైన నెరు లేగి
నిసుఁగుచింపిరిజుట్టు నిక్కవొడిచె
తే. గీ. డాలుసరిగంచుకట్టుపుట్టమ్ము వదలి
మేచకాంశుకపుంబుట్టగోచి వాలిచె
నాత్రిశంకునృపాలున కక్కజముగ
గౌరవాపత్యశాపవాక్యములవలన. 34

ఉ. నిద్దపుజాళువాపసిఁడినిగ్గుల కెగ్గులఁ గూర్చు మేనిడాల్
నిద్దుర వోయి హేయ మగు నీలిమ మాముఃకొనెం గడుం గడున్
ముద్దులమూటఁ గట్టు నగుమోము నుపరక్తమృగాంకువావిరిం
దద్దయుఁ గాంతిదక్కె వసుధాపరిపాలకపాళిమౌళికిన్. 35

కం. వాసిష్ఠాకృప నంతే
వాసిత్వము మున్ను గొన్న వసుధేశ్వరుఁడే
వాసిష్ఠాకృప నంతే
వాసిత్వముఁ గాంచె నేఁడ వారణవిధిచేన్. 36

కం. శాపోపహతుఁడ నగుటన్
రూపరి నే నిపుడు మిపుల రూపఱి యుంటిన్
ఈపగిది మఱియు మాఱిన
నేపుగ సుఖియించి యుందు నే యని తనలోన్. 37

తే. గీ. తలఁచి నెమ్మేను నొదలఁ దడుముకొనుచు
దశదిశాంతముఁ గనుచు వితాకుపడుచు
విహ్వలించుచుఁ జేతులఁ బిసికికొనుచు
నిలుచునృపు మంత్రిగణము దవ్వులనె కాంచి. 38

చ. "సచివశశాంకులార! మునిశాపముచే నిటు చేటు గంటి" న
న్వచనము లాలకించియును వారలు సేరఁగ రాక వీక సం
కుచితమనస్కులై వెగటు కుప్పతిలంగఁ బ్రధావనక్రియా
రచితజవంబుతోడ నగరంబును జేరి రథీశు వీడుచున్. 39

చ. పరువులువారునాత్మపరివారము నారసి సారె కుస్సు ర
స్సు రనుచు నుమ్మలించుచు విశోషితనైజగళాధరాక్షుఁడై
తెఱలెడుశోకసంగతి విధి న్మది దూఱుచు భూమిదారుఁ డే
తెరువును లేక నిల్వఁగ శ్రుతిద్వయిఁ దాఁకె దివాంధరావముల్. 40

ఉ. కౌశికకూజితారభటిఁ గార్కొనునాదెసఁ జూచి చూచి భూ
మీశుఁ డరుంధతీపతి నహీనగతిన్ దొలఁకయం దపించు నా
కౌశికునామధేయము తగన్ స్మృతి కెంతయు రా ననారతా
వేశముతోడఁ బొంగెఁ బరివేష్టితయాతన లంతరింపఁగన్. 41

సీ. కాలకాదంబినీగర్జారభటి నిరు
త్సాహమాయూరసంతతికిఁ బోలె
భయదనైదాఘాతప్రాభవావాప్తి
దుష్టశీతజ్వరార్తులకుఁ బోలె
దర్శప్రవృద్ధాంధతమసప్రసారమ్ము
హరిభుజంగసంహతికిఁ బోలె
శాతకౌక్షేయకాస్త్రంద్రవణాంకమ్ము
పనిస్త్రైకవీరవర్యునకుఁ బోలెఁ

తే. గీ. గౌశికనిశాటఖగగళాగళితరవము
వసుమతీనునకున్ శ్రుతిపర్వ మయ్యె
వెలయుఁగద స్వప్రయోజనాపేక్షిత మయి
విశ్వమందున సదసద్వివేచనమ్ము. 42

చ. నిరపథమోచనాపరత నిల్చి నరేంద్రుఁడు దంతపీడితా
ధరుఁ డగుచున్ నగంబుకనుదమ్ములు మోడిచి భావికార్యముం
గరము వినిర్ణయించి క్షణకాలసమాధిని వీటిఁబుచ్చి తాఁ
ద్వరఁ బయనించెఁ గౌశికనృపాలతపోవసికి న్నిశీథినిన్. 43

మ. సవిధస్మేరకుశేశయాపరిమళచ్ఛ్వాలినీవారిలో
నవగాహించి నిజాశ్రమాభిముఖుఁడై యశ్రాంత మేతెంచు భూ
ధవహానీశ్వరుఁ గౌశికుం దమి నయోధ్యానేత దర్శించి పా
దవనేజంబుల వ్రాలి యాత్మకథఁ బ్రస్తావించె నాద్యంతమున్. 44

సీ. సకలప్రజామోదసరణిఁ బాలించితి
నానువంశికరాజ్య మునధరించి
వివిధాధ్వరశతంబు విధిమై యజించితి
బహుళదక్షిణ లోలిఁ బ్రస్తరించి
స్వాప్నికావస్థలో సైతమ్ము సత్యమే
వాకొంటి నన్నృతమ్ముఁ బాఱఁద్రోలి
గురుమహాత్ముల మెప్పుఁ గొంటి నార్జవపూరి
తార్యధార్మికమార్గ మనుసరించి
తే. గీ. కాని వాసిష్ఠకృప నొందె కాంచ నైతి
వికృతచండాలరూపంబు వెలయఁ గరము
దిరుగుచున్నాఁడ నీరీతి దిక్కుమాలి
చెల్లఁబో! దైవ మెంతెంత బల్లిదంబొ! 45

ఉ. చాలఁగ నచ్చలించి మునిసంతతి జాలి యొకింత లేక చం
డాలునిగా శపించె నిటు నన్ను మహాశయ! నీట ముంచెదో
పాలను ముంచెదో సకలభారము నీపయి నుంచినాఁడ వే
యేల? కృపాళు వై యభయ మిచ్చినదాఁక విడం బదంబులన్. 46

మ. అవనీశ ప్రవతసంతతార్చనఫలం బత్యంత మీరీతిగా
నవమానంబులపాలు సేసెను గదయ్యా! తీఱె నయ్యాస, నన్
దివికిం బంపుఁడు దేహధారిగ సజాతీయాభిమానాఢ్యులై
సవనాధ్వర్యవ మూని మైళమ మహోత్సాహమ్ము వేడింపఁగన్. 47

కం. అని వెండియు జనవల్లభుఁ
డినుమిక్కిలి దీనభావ మేర్పడ వేఁడం
గనికరము దనర నాతనిఁ
గని కర మాతనికరమ్ముఁ గైకొని యనియెన్. 48

ఉ. శాంతి భజింపు మయ్య మహీశాసన ! గాధికుమారుసన్నిధిన్
జింతకుఁ దావు లేదు నివసింపుము మామకపర్ణశాలలో
నింతకు నెవ్వఁడైనఁ జనెనే విఫలుండయి కౌశికాశ్రితుం
డెంతయుఁ గూర్చినాఁడ వని యెంచుము నీయఱచేత స్వర్గమున్. 49

మ. అని యాజేని నృపాలమౌని యనుకంపాలోకనాభోగముల్
గునియన్ మస్తుగ గుస్తరించి తనతోఁ గొంపోయి నైజాశ్రమం
బునకున్; జాయకు శిష్యసంతతులకుం బుత్రాళికిం దత్ప్రవృ
త్తిని సాకల్యముగాఁ గథించి యనురక్తిం బల్కెఁ దా వెండియున్.

చ. అరుగుఁడు మీర లెల్ల నిఖిలాశ్రమసీమల నున్నసన్మునీ
శ్వరులకు విన్నవింపుఁడు త్రిశంకునృపాలుఁడు యాయజూకుఁ డ
ధ్వరమున కంచు; మీరలు సదస్యులుగాఁ జనుదెండఁటంచు నే
నురుతరదీక్ష జన్నమున కూఁతగ నిల్చితి నంచు మాటికిన్. 51

ఉ. అంచు వచింపఁ గౌశికమహామునినాయకశిష్యవర్గముల్
మించినవేగలీలల గమించిరి లో భయభక్తు లూర; ద
ర్శించి రనేకతాపసవరీయుల; గౌరవభాష లెల్ల వా
చించుచు నామతించిరి యజించుసవంబుఁ గనంగ సారెకున్. 52

సీ. బాపురే ! యని భరద్వాజుం డపహసించె
నట్టహాస మొనర్చె నత్రిమౌని
కాలవక్రతను మౌద్గల్యుండు దూషించెఁ
గనుబొమల్ ముడివైచెఁ గశ్యపుండు
కృతి నైతి నని కన్ను గిలిపె వత్సాసుండు
తలను గదల్చె గౌతమమహర్షి
నిట్టూర్పు విడిచె శాండిల్యవాచంయమి
నటియించెఁ గేరుచు నారదుండు

తే. గీ. పూనముద్రను వహియించె శౌనకుండు
ముక్కుపై వ్రేలి నిడెఁ దుల్యమునివరుండు
పక్ష్మలింపకఁ జూచె జాబాలిఋషియు
నొక్కచోఁ జేరి కౌశికాపహ్నుతిఁ దలఁచి. 53

ఉ. ఎక్కడిపాపమో యచటి కేగక తీఱదు వాని కింతకున్
ముక్కునఁ గోప మున్నయదిపో యనుమానము లెంతమాత్రముం
దక్కువ వోనిచో ననుచుఁ దత్కుశికాత్మజభీతచిత్తులై
పోకుచు యజ్ఞవాటికకుఁ బోయి రుపాంతవసన్మునీశ్వరుల్. 54

సీ. అధ్వరసందర్శనార్థసమాసన్న
మునులకు నెదురుగాఁ బోవువారు
యాజకాదేశానుయాయులై ప్రాగ్వంశ
నిర్మాణకార్యముల్ నెఱపువారు
సవనోపయోగచషాలయూపారణి
చమసస్రువాదుల సరదువారు
నుద్గాతృముఖయాజకోత్తమసమితికిఁ
బ్రత్యేకవసతు లేర్పఱుచువారు

తే. గీ. మించువైఖరిఁ గుంబ నిర్మించువారుఁ
గుశసమిత్పాళి నొకచోటఁ గూర్చువారు
నగుచు గాధేయశిష్యు లత్యంతసంభ్ర
మమ్ము దీపింపఁ గార్యనిమగ్నులైరి. 55

మ. మునిలోకంబుల నామతించుటకునై పోవంగ గుర్వాజ్ఞ నం
దినజంఘాలురు గాధిరాజతనయాంతేవాసు లేతెంచి యా
వినయాకుంచితసుందరాస్యు లగుచున్ విస్ఫారితాధ్వర్యమం
బున వాచాశిథిలత్వ మొప్ప గురుదేవుం బల్కి రీవావిరిన్. 56

కం. చనినారము మీఁషనుపున
జనితానందమున మౌనిజనతాశ్రమముల్
గనినారము వారల వా
కొనినారము కార్య; మియ్యకొనినారు ఋషుల్. 57

తే. గీ. కాని వాసిష్ఠు లురుదురాగ్రహము కనుల
గ్రేవలందునఁ గడుఁ దరంగితము గాఁగ
వికవిక న్నగి పరిహాసవిధిఁ గదల్చి
శిరము; లీలీల మనల దూషించినారు. 58

మ. ఒకచండాలుఁడు మాయజూకుఁడఁట రాజోత్తంసుఁ డొక్కండు దా
నికి నాధ్వర్యవ మూను నంట యట మౌనివ్రాతముల్ సభ్యులై
యకలంకోన్నతి నిర్వహింతు రఁట వహ్వా! మాయురే! బాపురే!
యిఁకఁ జెప్పం బనియేమి సాఁగుఁ గ్రతు వెంతే శ్రాద్ధయోగ్యంబుగన్.

ఉ. యాగము సేయువేళ నమరావళి కోరిక లూరఁగా హవి
ర్భాగము లాహరించుటకు వత్తురె? కౌశికశాసనార్భటిఁ
సాఁగినభీతవిప్రులు జనంగమభోజన మాచరించి స్వ
ర్భోగముఁ గుండలించుకొనఁ బోలునె? కూలెనె తద్వివేకముల్.

కం. అని వారు తెగడి జంకిం
చినఁ జేయున దేమి లేక సిగ్గునఁ గడకున్
వెనుకకు మఱలితి మయ్యా!
యని యంతేవాసు లనఁగ సాగ్రహలీలన్. 61

శా. ఏమేమీ! యిటు కండకావరము లెంతేఁ గ్రమ్మెనా? నేరరే
యామూఢాత్ములు మత్తపశ్చరణమాహాత్మ్యంబు గోరంత యి
స్సీ! మద్యాగతిఁ దూలనాడిరఁట వాసిష్ఠుల్ బళా! మృత్యువుం
దామే చెంతకుఁ జేరఁబిల్చుటయె కాదా మమ్ము రాకించుటల్. 62

మ. ఉరగేంద్రమ్మును ముద్దు వెట్టుకొన నుద్యోగించిరా! పుక్కిటన్
ఖరహాలాహలమున్ ఘటించుకొన సంకల్పించిరా! సింహకే
సరముల్ రెమ్మఁ దలంచిరా! యిటులు విశ్వామిత్రమౌనీశ్వరుం
బరిభాషింపఁగ సాహసంబు గనిరా! పాపం బిటుల్ పండెనా? 63

మ. అనిశంబున్ వికృతాకృతుల్ గదుర సర్వాంగీనమై దీనమై
జనముల్ గోయ బలమ్ము వాయ సిలుగుల్ సంధిల్ల వ్రాతీనమై
తనుకార్శ్యం బెసఁగన్ వసిష్ఠమునిసంతానమ్ము నాశమ్ముఁ గ
న్గొనుతన్ సర్వపథీనమై తుదకు నాక్రోశించుచున్ దుర్విధిన్. 64

తే. గీ. అనుచు గాధేయరాజర్షి యావసిష్ఠ
సుతుల నందఱ శాపోపహతులఁ జేయ
సప్తతంతుసరీక్షణాసన్నమౌని
మండలమ్మున గోడలఁ గంపము జనించె. 65

మ. ఇటుః శాపించుచుఁ బారిపార్శ్వకుని నయ్యిక్ష్వాకుదాయాదు న
క్కటికం బారఁగఁ జూపి మౌనులకు సాకల్యంబుగం దత్కథా
పటలంబున్ విశదీకరించి సురభూవాసంబు దేహంబుతోఁ
బటుయాగాచరణంబుచే నొసఁగ విశ్వామిత్రుఁడున్ వాకొనన్. 66

చ. మనములయందు నిష్ఠ మణుమాత్రము లేకయె కౌశికుండు కో
పనుఁ డని భీతిచేతఁ బ్రతిభాషలఁ బల్కఁగ నోడి స్వామి! మీ
యనుమతి నెల్లవారమును నాయిత మైతిమి యాగకర్మముం
బొనరుప నంచు మౌను లన మోదమతిం గుశికాత్మజాతుఁడున్. 67

ఆ. వె. యాజకుండు గాఁగ, నార్త్విజ్యమును మంత్ర
కోవిదార్షవితతి గొని యజించె
విధివిధానములకు వెలి గాక పటుదీక్షఁ
గుశికనందనుండుఁ గొంతవడికి. 68

కం. దేవతల నెల్లఁ గ్రమమున
నావాహన మాచరించె యాగహవిర్భా
గావళిఁ గైకొన; నిర్జరు
లేవారును రాకయుంట నెంతయు మదిలోన్. 69

మ. పరమామ్నాయము నొంగలింప స్రువముం బై కెత్తి గాధేయుఁడున్
గుపుకంఠస్వర మేస రేఁగఁగఁ త్రిశంకుం గాంచి "హే మేదినీ
వర ! త్వాం పశ్య మదార్జితామితతపోవ్యాపారపారీణతాం
సరయం గచ్ఛ దివ" మ్మఁటంచుఁ బలుకన్ క్ష్మాజాని తాఁ జివ్వనన్.

కం. తరణిం గడువడిఁ గడిగొన
నరుగు విధుంతుదువిధంబు లమర నమరలో
కరిరంసుండు త్రిశంకుం
డరిగెం దారాపథంబునం దరుదారన్. 71

కం. పవమానమానసోపమ
జవమానితుఁ డగుచు నిట్లు చని కనుఁగొనె భూ
ధవమాణిక్యము గంగా
చ్యవమానానిలసముల్లసన్నందనమున్. 72

మ. పరిశీలించుచు దాని క్రేవఁ గలత్రోవం గొంతద వ్వేగి యా
సరణిన్ వీడి మలంగి డాబుజము మేల్పాయం గ్రమింపన్ మహా
సరహాస్యాత్మకళాప్రసంగకలనాసంతోషితస్వాంతు లా .
వరమానీశుల నల్వురన్ సురతరూపవ్యాపితచ్ఛాయలన్. 73

చ. కనుఁగొని "వీరి నెచ్చటనొ గాంచితి ము" న్నని సంశయించుచున్
మనమున "నావసిష్ఠమునిమాన్యతపోవని కేగుదెంచు నా
సనకసనందనాదు" లని శంకను ద్రోయుచు నిర్ధరించి వా
రిని బటుహాయకాయము ధరించుచు డాయఁగఁ గొంత కొంకుచున్.

చ. వెనుకకు నేగి యన్యపదవీచరుఁ డై యమరావతీపురిం
జను నెడ "నెట్లు వచ్చెను జనంగము డామరభూమి కిన్నఁడుం
గని వినవట్టివింగడము గల్గెను నేఁ" డని వీధి నిర్జరుల్
మనముల నేవగించుకొని మాటికి మాటికి నోర లై చనన్. 75

చ. అరుగుచు నున్న యాసరణి నామరధారణి వేశవాటిగా
నెఱిఁగి త్రిశంకుఁ డాత్మగతహేయతనూగతి మానసించుచుం
గర మెద విహ్వలించుచు నొకానొకకొన్ని పదమ్ము లేగు దో
విరిసె విటీవిటాళి తనువీక్షణముం బొనరించి నవ్వుచున్. 76

సీ. సాలభంజికపైనఁ జనుదోయి నాని ప
ల్మరు వంగి శీలించె మంజుఘోష
ద్వారబంధముఁ గరద్వయిఁ బట్టి నెమ్మోము
చిట్లించుకొనుచుఁ గాంచె శశిరేఖ
గాజుతల్పులజాలకము సామ విచ్చి దో
బూచియాటగ నోరఁ జూచె హారిణి
వెనుకొనువిటునిపై విసిమాలుచుం బైఁట
సెదర నేతెంచి వీక్షించె హేమ

తే. గీ. విరిసురఁటిఁ జేరెదన్ హత్తి విరసదృష్టి
వీఁక సారించె మేనకానాకగణిక
బొమల ముడివైచి యఱచూపు వొదలఁ గనె వి
తాకు ముంచుకొనం దిలోత్తమయు నృపుని. 77

ఉ. ద్వారముచెంతఁ జాలఁగ నొడాళము సేయుచు రాయిడించు హం
వీరుల క్షత్రియోత్తముల విప్రవరేణ్యుల సోమయాజులన్
సారెకు వేత్రహస్తు లయి జంకె మొనర్చుచు నిల్చియున్న రం
భారమణీసఖీయుగళిఁ బాత్రిపుఁ డారసి యాఁగె నయ్యెడన్. 78

గీ. పీరపానంబుచేఁ జాల విసివి విసివి
సోమపానంబుచేఁ గడు సొగసి సొగసి
వీకులును యాజులును నిటఁ జేరినా ర
నూనరంభాధరాధరపానమునకు. 79

తే. గీ. ఇనశశిదృగంచదచ్యుతాననము వోలె
నళనిపానీయయుతబలాహకము వోలె
వ్యాఘ్రవాతాయులసదరణ్యాని వోలె
రంభయిల్లు రజస్సత్త్వరాజితమ్ము. 80

కం. అక్షీణాలంకృతిఁ గృతి
దక్షిణనాయకు లిఖించి తనసిరి రంభన్
వీక్షించిన దో వ్రాయరె
దక్షిణనాయికనుగూడఁ దమగ్రంథములన్. 81

చ. అనుచుఁ ద్రిశంకురాజమణి యుబ్బర ముబ్బ, ననూయ మిఱి వా
రనిగతి జాలువాఱఁగఁ బరస్పరముం గను వీరయాజులం
గనుఁగొనుచున్ విరాకు లెసఁగన్ సిలువం, గటుభీకరార్భటుల్
దనరఁగఁ దన్నృపాలకు నదల్చుచు వచ్చిరి దేవతాభటుల్. 82

చ. విదితజనంగమాగమనవిస్తృతవార్తుఁడు వృత్రవైరి తా
ముదల నొసంగి పంప జవముల్ తగ వచ్చిన నాభటావళుల్
గదియుచుఁ జుట్టుముట్టి మెడ గట్టిగఁ బట్టియు గెంటి గెంటి స
మ్మదమున మేదినిం బడఁగ మానవనాయకు పీక నూకఁగన్. 83

ఉ. కేశము లావరింపఁ దలక్రిందుగఁ దాఁ బడుచుం గడున్ భయా
వేశముతోడ నాకసము బీటలువాఱఁగఁ గేకరించుచుం
'గౌశిక ! త్రాహి మా' మనుచుఁ గాళులఁ జేతులఁ దన్నుకొంచు భూ
మీశుఁడు వేసటం బడుచు నెంతయుఁ దోఁపఁగ గాధిసూతియున్. 84

ఉ. అట్టి మొగమ్ము నెత్తి పతదార్తనరేంద్రునిఁ గాంచి రోషముల్
దెట్టువగట్ట బాహువుఁ బదింబది యూఁపుచు "నత్ర తిష్ఠ" యం
చిట్టుల హూరవాగ్భటి రహింపఁగ లేచెను గ్రోధపాటుతో
నిట్టటుఁ బాయగిల్లఁగ మునీశ్వరు లున్నమితాననాబ్జులై. 85

కం. నరపాలుఁ డుర్విఁ బడ కం
బర మందె వసించెఁ దా నవాఙ్మస్తకుఁడై
పరమక్రోధముతో నర
వరముని సృజింపఁబోడఁగె స్వర్గాంతరమున్. 86

ఉ. మానసికప్రవృత్తి క్షణమాత్రనిరోధ మొనర్చి మేదినీ
జాని వసించుదిక్కుగ నచంచలతారక లాని గాధిరాట్
సూనుఁడు చూచెఁ; జూచుటయు సుందరమూర్తు లపారతేజు లా
జానుభుజుల్ తపోనిధులు సంయమివర్యులుఁ బుట్టి రయ్యెడన్. 87

ఉ. క్రమ్మఱ గాధినందనుఁడు కన్నుఁగవన్ ముకుళీకరించి ధ్యా
న మ్మొనరించి మాటికిఁ గనంగొడఁగెన్ దివిఁ బక్ష్మలించుచున్
"హు" మ్మని సారె కంచుఁ దల నూఁపుచు; నంత ననంతతేజముల్
జిమ్ముచుఁ గమ్మిరించెను విచిత్రగతిన్ వరతారకావళుల్. 88

శా. దైతేయావళినాయకప్రకటితోద్దండార్భటీఘాటికిన్
భీతిం జెందనివారి, నిర్జరులఁ, బ్రస్ఫీతాంగులన్, యాగభా
గాతంద్రానిశకాములై యనవదేవానేకమున్ వేఁడుమం
జేతుల్ సాఁపనివారిఁ దా నమరులన్ సృష్టించె నిచ్ఛాగతిన్. 89

తే. గీ. అమృతముం గామగవిఁ గల్పకాగములుఁ
గౌశికతపస్వి విరచింపఁ గడఁగఁ డయ్యె
నమరశబ్దము సార్థమై యమరకతనఁ
దత్ప్రజకుఁ గోరఁదగువస్తుతతియె లేమి. 90

ఉ. జామరజామరంబు, శుకశారులచారురవంబుఁ బైపయిం
గైమువు దూయఁ గోరు నుడికారము మేల్నయగారమున్, విటా
సాదితవాంఛితానుగతసారవిచిత్రరతిప్రకారముం
బాదుకొనన్ సృజించె నట వారవిసారదృశాసమాజమున్. 91

సీ. మందాకినీహాసన్మధురపంకేరుహం
బులలోనిగంధముల్ ముచ్చిలించి
సారమాతంగమాంసలకుంభయుగళీవి
శేషసౌందర్యమ్ము సేకరించి
పారిజాతాగమప్రత్యగ్రకిసలాలి
నలరారుమార్దవం బపచయించి
గోత్రవైరిభటాళిగోపాయితాంతస్సు
ధాసారరస మన్యథాకరించి
తే. గీ. యభినవస్వర్గగాణిక్యహారిదేహ
కుచపదాధరసీమలం గుస్తరించె
మివులఁ జెన్నొంద రంభాదిమేనకాంత
కాంత లాదలలన్ వంపఁ గౌశికుండు. 92

కం. ఋతుషట్క మచట వెలయుం
బ్రతిదివసంబునను వివిధఫలసుమనస్సం
తతిఁ బోహాళించుచుం ద
ద్గతజనతకు నెంతయున్ ముద మ్ముదయింపన్. 93

సీ. ఆయుధమ్ములఁ ద్రుప్పు నపనయించుటె కాని
సాంపరాయికము లేశమ్ము లేదు
సరకుల నంగళ్ల సవదరించుటె కాని
క్రయమును మఱియు విక్రయము లేదు

అమితమహావిరహార్తి నభినయించుటె కాని
జంపతివిశ్లేషసరణి లేదు
ఔపసికస్నాన మాచరించుటె కాని
తనువుల మలినగంధమ్ము లేదు
తే. గీ. సురుచిరాలంకృతులను దాల్చుటయె కాని
సుంతయున్ సుందరతలోఁ గొఱంత లేదు
కౌశికనవీననాకలోకమ్మునందు
సమ్మదముతోఁ జరించులోకమ్మునందు. 94

కం. హరిహరహిరణ్యగర్భులు
హరిహయముఖహరిదధీశు లాశీవిషకి
న్నరనరకింపురుషాసుర
గరుడులుఁ దత్సీమఁ జేరఁగా రా దనుచున్. 95

ఉ. కట్టడ సేసి దానికి నొకానొక సేతను వాసవాధికున్
నెట్టన సంసృజించి యట నిల్వఁగ రమ్మని మానసించుచో
బిట్టు చలించి పూర్వదివి పీసరవోవు నటంచు దేవస
మ్రాట్టు సమస్తతాపససురప్రకరంబులు వెంట నంటఁగన్. 96

ఉ. తత్తరపాటు పాటిలఁ బదమ్ములు పల్లటిలంగ వచ్చి డ
గ్గుత్తిక గండరింపఁ గనుఁగోనలు దీనత నీన గాధిరా
జోత్తమసూను నెంతయుఁ బ్రియోక్తుల సన్నుతి సేసి కోపసం
పత్తి నొకింత బాపి యిటు వల్కెఁ గరంబుల సంపుటించుచున్. 97

చ. నరవరుఁ ద్రోసిపుచ్చి తని నాపయి నల్క వహింప నేల? మీ
రెఱుఁగని ధర్మ మున్నదె? మునీశ్వరలోకశిరోవతంసమా!
గురుగురుశాపవాక్క్షతునకున్ సశరీరదివోధివాస మే
కరణి నొసంగు మందు రిది కర్జమె? మీమతి సమ్మతించునే?. 98

ఉ. నావుడు కౌశికుండు నయనద్వయముం గయిమోడ్చి శాతకో
పావిలమానసంబు నతియత్నముచేత దమించి నాకలో
కావనినాయకాననము నారసి కైతవతీవ్రలీలఁ బ్ర
స్తావన మాచరించె నిటు సంయములున్ సురలుం గలంగఁగన్. 99

ఉ. నీపయి నచ్చలించి దివి నేను రచించినవాఁడఁ గాను నా
ప్రాపును గొన్న భూపతికి బాస నొసంగితి "స్వర్గపట్టణా
రోపితునిన్నొనర్తు ననిరోధవిధంబున" నంచు మామకా
లాపము లేగతిన్ విడఁగలాఁడ నధర్మపథానువర్తినై. 100

మ విరళాయాససమార్జితైకతపమున్ వెచ్చించి కల్పించి యా
మరలోకాంతరముం రచించితి నసామాన్యాభిరామంబుగా
స్థిరమై రాజిలుఁగాక మామకమహస్సృష్టిక్రమం బేగతిం
జెఱుపం జేతులు సాఁగుఁ జెప్పుమిఁక లాసేధింపఁగాఁ జెల్లునే? 101

తే. గీ. అనుచు నిట్టూర్చి తల వంప నమరవిభుఁడు
గజిబిజించిన మది నాస కందళింప
వేయికన్నుల నొకమాఱు విచ్చి చూచి
పలికె నీలీల వినయమ్ము పాత్రలాడ. 102

కం. ఘటనాఘటనసమర్థుఁడ
విటుఁ బట్టి సృజింప మాని యీయున్నవో
త్కటనాకలోకమున కె
క్కటిచేసిఁ త్రిశంకుఁ జేయఁగా నగు నయ్యా ! 103

ఆ. వె. తావకీనరచితతారకావళి వానిఁ
జేరి మిథులఁ బ్రోది సేయుఁగాక
యందు మెలఁగు నూతనామరబృందమ్ము
సతత మతనిపనుపు సలుపుఁగాక. 104

ఉ. మౌనివరా! పునారచన మానక నీ వొనరించి యాజగ
న్మానితుఁ డైనధాత కవమాన మొనర్తువె? కీర్తి కంచుమిం
చై నెగడఁగ వెలార్తువె? భయాకులమానసమామకీనదీ
నాననసీమలం గను మయా! మహనీయసదాదయామయా. 105

తే. గీ. త్రిజగతీహితకారు లై స్థిరయశమ్ము
నందికొని మృతజీవు లై యలరువారిఁ
దావకీనులఁ బూర్వులఁ దలఁచి తలఁచి
సలుపు మాదట నెదియేని సంయమీశ. 106

కం. సాజమ్ముగ గాధిపురా
పూజాఫలకలనవలనఁ బొందితిఁ గాదే
రాజోత్తమ! బ్రహ్మత్వం
బోజఁ బున స్తపము సేయ నూహ లిఁకేలా? 107

చ. అనవుడు కౌశికుండు దరహాసము వెన్నెలఁ గాయఁ బాకశా
సనుఁ గని "మాత్రిలోకవిభుశాసనముల్ మురళింప నేర్తునే"
యని సరసంబుగాఁ బలికె యామరపుంగవులన్ సదస్యులన్
మునులను బుచ్చె నాచరితభూరితరాదరపూర్వకంబుగన్. 108

కం. అని యేవంగతి గౌతమ
తనయశిరోమండనుఁడు శతానందుఁడు వా
కొనుఁడు రఘుకులుఁడు రాముఁడు
విని యిటు ప్రశ్నించె వెల్లివిరిసినతమితోన్. 109

తే. గీ. హరిహాయుఁడు గాధిజునకు బ్రహ్మత్వ మాది
యందె కల దని వినుతించె ననిరి మీరు
కరుణ నెఱిఁగింపు డాకథాక్రమముఁగూడ
సంగ్రహంబుగఁ గర్ణరసాయనముగ. 110

వ. నావుడు శతానందుం డపరిమితానందుం డై యనన్యాదృశం బగు నధ్యవసాయంబు వరంగలింప దాశరథి కిట్లనియె. 111

చ. భృగుకులవర్ధనుం డుఁ బరివేల్లితసన్మహిమాన్వితుండు నై
తగు చ్యవనుం డొకప్డు భవితవ్యము నారసి దివ్యదృష్టిచే
భృగుకుశికాన్వయద్వయభవిష్ణుపరస్పరసంకరత్వముల్
మిగుల నెఱింగి తత్కుశికనిస్తులవంశవినాశకామి యై. 112

చ. చని కుశికావరోధనవిశాలతలాంతరరత్నకాంచనా
సనమున నావసించి నృపజంపతు లప్పన సేయుపూజలం
గొని యట వాసరావసులఁ గొన్నిటిఁ బుచ్చెద నంచుఁ బల్క వా
రనుమతి సేసి యొక్కమధురాలయసీమ ఘటించి రాతనిన్. 113

తే. గీ. పట్టమహిషియుఁ గుశికుండుఁ బదము లొత్త
నిదుర భంగింప వల దని నియతి సేసి
తాపసియు హంసతూలికాతల్పమందు
గాఢనిద్రాపరీరంభకలనఁ బొలిచె. 114

చ. ఇరువదిపైన నొక్కదిన మీకరణిన్ నిదురించి లేచి కి
క్కురు మనకుండఁ దా నచటికో పయనింపఁదొడంగె మౌని మం
దిరమును వీడి భూవిభుఁడు దేవేరితో వెనువెంట నంటఁగాఁ
దిరుగక యొక్కమూలుగ నదృశ్యతఁ గాంచె మహాద్భుతమ్ముగన్.

ఉ. చేయున దేమి లేక నృపశేఖరుఁ డంతిపురంబు నల్లనన్
జాయను గూడి చేరెను విచారముతో; నచటన్ యథాస్థితిన్
హాయిగఁ గూర్కు నాచ్యవను నారసి యబ్బుర మంది చెంతకుం
బోయి తదీయపాదయుగి బోఁటియుఁ దానును బట్టి యొత్తఁగన్.

గీ. ఏకవింశతిదివసంబు లేగుపిదపఁ
జ్యవనముని యావులించుచు నల్ల లేచి

సౌఖశాయినికుల రాజజంపతులను
బనిచెఁ దన కొనరింప నభ్యంజనంబు. 117

సీ. ఉద్వర్తనవ్యాజ మూని యెముకల నుగ్గుఁ
గావింతురా యంచుఁ గసరి కసరి
విడఁదీయుదు మఁటంచు జడ లెమ్ముచున్నారె
యని నిష్ఠురోక్తుల నాడి యాడి
ఫేనిలఫేనంబు నానేత్రయుగిఁ జిల్కి
కారింతురే యంచు గదిమి గదిమి
పొంగువారెదు నీకు వారెయంగ మీచేతు
లెట్టాడె నంచును దిట్టి తిట్టి

గీ. దాడ తాటించి డాకాలఁ దన్ని తన్ని
హుంకరించి మొగాలపై నుమిసి యుమిసి
కరరుహాళి విదారించి కఱచి కఱచి
యలసి యలయించి యభ్యంగ మాచరించి. 118

తే. గీ. సకలవిధభోజ్యముల శయ్యఁ జక్కఁబఱుపఁ
గా నియోగించి వసనమ్ముఁ గప్పి పైన
నగ్నిసంస్కార మొనరించి యతఁ డతీత
గతిని డబ్బాటు తాఁ దిరోహితతఁ గాంచె. 119

మ. మఱునాఁ డాతఁడు వచ్చి దంపతులసన్మానంబులం గాంచి సం
గరరంగోచిత హూళతాంగముపయిం గాంతాళభావంబులం
బరిపోషించుచు నెక్కి యాల్మగ లోగిన్ లాగ న్నియోగించి నా
గరవీథిం బయనించె సారెకుఁ గశాఘాతంబులం జిమ్ముచున్. 120

తే. గీ. కటుతరకశాప్రయోగనిర్గళితరుధిర
ధార చెమ్మటచేఁ బల్చనై రహింప
భక్తి మితి మీఱ రథభారవాహులైరి
పరమసాధ్వియు నాక్షమావల్లభుఁడును. 121

చ. పురమున నెల్లెడం దిరిగి భూపతియున్ సతియున్ శ్రమంబుతో
నరదము లాగి లాగి తుది నాఁపిరి యంతిపురమ్ము చెంగటం
గరము ప్రసన్నుఁడై ముని వికావికలై శ్రమ మెల్లఁ బాఱఁగాఁ
గరమున వారల న్నిమిరెఁ గమ్మనిమాటల బుజ్జగించుచున్. 122

కం. అలతపసి కేలు తాఁకునఁ
దొలఁగెన్ మంత్రించినటు ప్రతోదముచేతం
గలిగినతట్టులు గాయం
బులు నాయాసంబు నస్రమును నస్రమ్మున్. 123

మ. కరుణాసాంద్రుఁడు పూని వెంటఁగొని గంగాతీరముం జేర్చి యా
సురలోకమ్మును జూపె వారలకు నస్తోకప్రభావమ్మునం
బరమానందము నంది రావసుమతీపాలుండు నాసాధ్వియుం
బరిశీలించి తదీయమంజిమములన్ వ్యాకోచనేత్రమ్ములన్. 124

కం. పూని యటుపిదప నంత
ర్ధాన మ్మొనరించి యమరధర; నమృతపుమే
ల్సోనలు దైవాఱఁగఁ గనుఁ
గోనలఁ గనుఁగొనుచు నిటులఁ గులుకుచుఁ బలికెన్. 125

మ. విను మోయీ కుశికావనీశ ! యిటుపై విప్రత్వమున్ క్షాత్రముం
గను సాంకర్య మటం చెఱింగి కడు న్యక్కారమ్ముతో నీకొలం
బును విధ్వంస మొనర్ప వచ్చి సిలుగుల్ పూరించితిన్ మీఁకు నే
ననుకంపామతి నైతి నింక భవదీయానూనసేవాగతిన్. 126

తే. గీ. నీకు మూఁడవవాఁ డయి నెగడువాఁడు
భార్గవైకప్రసాదాప్తి బ్రహ్మతేజుఁ
డగుచు జన్మించు, మీవంశ మంతనుండి
బ్రహ్మవంశంబ యై కడు వఱలఁగలదు. 127

వ. అది యెటులందు వేని. 128

తే. గీ. క్షత్రియుల యాజకతను భార్గవులు గాంతు
రాది నలవారిలో భేద మంకురించు
క్షత్రియులు భార్గవుల నెల్ల సంహరింతు
రమితభీభత్స మగు నట్టిసమయమందు. 129

చ. సుచిరభార్గవాన్వయము శోభిలు నూర్వుచేత వానికిన్
స్థిరధనురాగమాఢ్యుఁడు ఋచీకుఁడు పుట్టు నతండు గాధిభూ
వరతనయం ద్వదీయవరపుత్రిని బెండిలి యాడి కాంచు ను
ద్వరమహిమావిశాలు జమదగ్నిమునీంద్రజనావతంసమున్. 130

శా. మానీంద్రుండు ఋచీకుఁ డర్థ్వవిధి బ్రాహ్మక్షాత్రతేజంబులం
డా నెంతేసిఁ జరుద్వయాంతరమునన్ సంధించి యాత్మీయజా
యానిర్బంధముచేత; నాదిమము నిల్లాలత్త యన్యంబుఁ గై
కొ న్నిర్ణీత మొనర్చి భార్యకు నొసంగున్ వేఱు నా వేఱుగాన్. 131

చ. కులధర్మంబుల నెంచి చేసెఁ జరు వర్గాంధాశయం బాత్మలోఁ
దలఁపంబోక; నిజాంగనాచరువు విస్తారైకసారంబుచే
బలకాయించునఁటంచుఁ బుత్రి చరువుం బ్రాసించి యాత్మీయమున్
మెలమెల్లన్ సుత కిచ్చు గాధిసతి యామెన్ సూస్త్రలం దేల్చుచున్.

తే. గీ. తాటుమా ఱొనరించి రత్తయును సతియుఁ
జరువు లని విని ముని తనజాయఁ గాంచి
"ఓసి నిర్భాగ్యురాల! నీ కుద్భవించుఁ
బరమదారుణమార్గణవ్రతుఁడు సుతుఁడు. 133

మ. అని కోపించి వచింప నాత్మవిభుపాదాబ్జంబులన్ వ్రాలి గా
ధిన రేంద్రాత్మజ చాల వేఁడుకొన శాంతిం బూని మానీంద్రుఁ డో
వనితా! నీసుతుఁ డుత్తముండె యగు నీపౌత్రుండు హింసారతుం
డనయం బౌ నిది తప్ప దంచుఁ దనజాయం గుస్తరించుం దమిన్.

ఆ. వె. బ్రాహ్మసాధుధర్మపరుని విశ్వామిత్రు
గాధిరాజపత్ని గను; ఋచీకు
సారసాక్షి గాంచు జమదగ్ని నతఁడు క్షా
త్రప్రధానుఁ బరశురాముఁ గాంచు. 135

చ. అని భవితవ్యముం జ్యవనుఁ డాకుశికావనిపాలపాళి కాం
తనిసతికిం గథించి నృపదంపతులం గడు గారవించి పం
చెను బుటభేదనంబునకు శ్రీరఘువంశపయోధిచంద్ర! యీ
ఘనముని కౌశికుం డిటులఁ గాంచెను జన్మముచేత బ్రహ్మతన్. 136

కం. అనుచు శతానందుం డిటు
తనవాకొనుకథ ముగింప దాశరథి మనో
వనజాతము వికసింపఁగ
ననంతరకథన్ వచింప నర్థించెఁ దమిన్. 137

పంక్తివృత్తము. సాదరమానస! హారిగుణా!
భూధవసత్కవిపూజిత! శ్రీ
పాదమహాన్వయవార్ధిశశీ!
వేదవిదగ్రణి! విశ్వకవీ! 138

గద్యము.

ఇది శ్రీహరిహరదేవదయాపాంగప్రసారణసమాసాదితోభయభాషాకవితా
రచనాప్రవీణ, కాకరపర్తిపనామకకాశ్యపసగోత్రపవిత్ర, బాప
నార్యభిషక్సార్వభౌమపౌత్ర, వేంకమాంబావేంకటరాయ
సుధీపుణ్యదంపతితనూజ, కవికంఠీరవ, కవిమూర్ధన్య
మహాబిరుదవిరాజమాన, కృష్ణశాస్త్రిప్రణీతంబైన
కౌశికాభ్యుదయమహాప్రబంధంబునందుఁ
ద్వితీయాశ్వాసము

---

హరిహరదేవాయ నమః

# కౌశికాభ్యుదయము

## తురీయాశ్వాసము

కం. శ్రీసఖపరమాంశభవ
వ్యాసమునీశకృతభారతాంధ్రీకరణై
కాసాదితమహితాంధ్ర
వ్యాసబిరుద! కృష్ణమూర్తి! వాసితకీర్తి! 1

తే. గీ. ఆలకింపుము దశరథక్ష్మాధిపాల
నందనుఁడు రామునకు శతానందుఁ డిట్టు
లివతళించునుడుల్ గమాయింప గాధి
పుత్రకోత్తరచారిత్రమును వచించె. 2

మ. సురలోకాంతరకార్యనిర్వహణ మచ్చో నంతరాయంబుచేఁ
బరిపూర్తిం గనకుంటచేతను వృథావ్యాపార మాత్మీయని
ర్భరనిర్నిద్రతపోనిరోధి యగుటన్ వ్యాపాదితాశాంతి యై
తరలెన్ గాధిసుతుండు పశ్చిమహరిత్ప్రాంతావనిన్ డాయఁగన్. 3

తే. గీ. మూలఫలమాత్రభోజి యై పుష్కరములఁ
దపము సాఁగించెఁ బటుదురాధర్షలీల
దైవతావళి కలఁగి విత్రాకు నంద
నాకుశికనందనుం డట్టియవసరమున. 4

ఆ. వె. అంబరీషుఁ డనెడు నవనీధవాగ్రణి
యమితదీక్ష సవన మాచరింప
యాజకాంతరస్థలాసీనుఁ డై యుండ
యజ్ఞపశువు నంత హరి హరించె. 5

కం. గోపాయితపశువును వే
యూపమునకుఁ గట్టఁగా నియోగించు నెడన్
వేపితతనుఁ డై హరణ
వ్యాపారముఁ దెలిపె నొక్కఁ డధినాథునకున్. 6

మ. యతనంబుల్ వితథంబు లై వెలయఁగా నయ్యంబరీషుండు తా
హృతమోదుం డగుచున్ వితాకుఁ గని శూన్యాలోకనంబుం బొన
ర్చుతఱిన్ యాజకమాళి ధర్మవిధి సంశోధించి శోధించి యీ
గతి బోధించె హితంబుఁ గోపరసవాక్యస్ఫూర్తి నర్తింపఁగన్. 7

చ. వెలవెల వోయె దేల పృథివీవర! యత్న మి దెల్ల గంగలోఁ
గలిసెను యాగజంతువును గాయఁగ నేరక సప్రమత్తతం
బొలిచితి వీదృశోపచితభూరిభుజాబలపూర్ణుఁ డైన ని
న్నలమక యూరకే తరలునా బలవత్తమదోషసంహతుల్. 8

కం. ఆయజ్ఞపశువుఁ దెచ్చెద
వో యొకనరపశువుఁ దెచ్చెదో యెదియొ మహో
పాయం బాలోచింపుము
ప్రాయశ్చిత్తమ్ముఁ జేయవలయు ననంగన్. 9

ఉ. ఆయచలాతలేశ్వరుఁ డహర్నిశముం బటుదీక్షతో నుపా
ధ్యాయవచోనుసారముగ నాశ్రమకానననాగరాంతరా
మేయతలంబులన్ వెదకి యెందుఁ గానంగ నిరాశఁ గ్రమ్మఱం
జేయున దేమి లేకట ఋచీకమునీశ్వరుఁ గాంచెఁ ద్రోవలోన్. 10

ఆ. వె. భార్గవాశ్రమమున భార్యాసుతత్రయీ
సహితు నతనిఁ గాంచి మహితభక్తిఁ
బాదనీరజములపై వ్రాలి యాత్మీయ
వితథయత్న మెల్ల విన్నవించి. 11

ఉ. ఇమ్ము నవమ్మునందు విశసింపఁగ నీసుతునిం గనీసహా
స్రమ్ముఁ బరిగ్రహించి యని సాహసలీల వచింప లేక చి
త్తమ్మున యాగనిర్వహణతత్పరతన్ విడనాడ లేక తా
నమ్మునిపొంత నిల్చె నమితాతురుఁడై విచికిత్స రేఁగఁగన్. 12

తే. గీ. కట్టకడ కాతఁడు సమీక్ష్యకారి యగుచు
బాహిర మొనర్చె హృదయభావంబు లెల్ల
నల్లనల్లన శిథిలవాక్యములఁ గులికి
తన్మునీశాననాంకవిధమ్ముఁ గనుచు. 13

మ. క్రతుసంపూర్తికి వేగిరించునృపు ధర్మప్రార్థనం బాత్మలో
నతిమాత్రంబు గణించి జ్యేష్ఠతనయాస్యంబందుఁ బ్రేమార్ద్రదృ
క్తతిఁ గీలించి ఋచీకమౌని ధరణీకాంతాగ్రణీ! జ్యేష్ఠు స
ద్గతిసంధాయకు విక్రయింప నని పల్కెం దత్సతీరత్నమున్. 14

చ. నిరుపమలీల బాహులఁ గనిష్ఠసుతుం బెనవైచి ప్రేమ మై
పొరిపొరి దువ్వుచున్ శిరము మూర్కొని కూఁకటిఁ జక్కఁ జేయుచున్
నరవర! యీయమాయికుఁ గొనం దలపోయకు మయ్య నాకు మ
ర్మరణముఁ గూర్పకయ్య బతిమాలెద నంచును రాల్చె బాష్పముల్.

తే. గీ. అంబరీషనృపాలకుఁ డాయవస్థ
నరసి గరుపాటు పాటిల నట్టె నిలిచె
మునికుమారులలో మధ్యముఁడు వివేకి
యగుశునశ్శేఫుఁ డీరీతి నాత్మ నెంచె. 16

మ. గతు లాముష్మికముల్ నికామముఁ గొనంగా నాదిమాపత్యముం
బితృపాదుండు నిరాకరించె నొసఁగం; బ్రేమాస్పదుం డౌటచే
వ్యతిరేకించెను వీడ నంబయుఁ గనిష్ఠాపత్యమున్; నేన త
త్క్రతుశాలం బశు వై నశింపఁగ నభిప్రాయంబు సూచించుచున్.

సీ. పశువుఁగాఁ బొమ్మంచుఁ బలుక నోరాడని
పితరులయెడఁదఁ దృష్టిన్ రహింప
నాందోళితాంబరీషాంతరంగంబులో
నాఁశాలతావహ్ని లల్లుకొనఁగఁ
క్రతుహవిర్భాగకాంక్షన్ నిరీక్షించు బృం
దారకశ్రేణుల నోరు లూర
నార్త్విజ్యదక్షిణాలం దాశ విడిచిన
యాజకుల్ పొంగి మిన్నందికొనఁగ

తే. గీ. మామకీనవదాన్యతామహితరీతి
నాధునికభావిలోకంబు లభినుతింపఁ
బరమపావనపావకజ్వాలలందు
నైక్య మై శాశ్వతానంద మందుకొందు. 18

ఆ. వె. అంచు నిర్ధరించి యాశునశ్శేఫుండు
మాత్రపితరులకు నమస్కరించె
నాఋచీకపత్ని యభ్యాసవశమున
ననియెఁ దాఁ "జిరాయుర" స్తుఁటంచు. 19

చ. కొమరునిపైనఁ గూర్మిఁ బయికొన్నపరాకునఁ గాంత పల్కువా
క్యము చెవి సోఁక హాని కడగన్నుల జాలియు శుష్కహాసమున్
దుముకఁగఁ జూచెఁ జూచుటయుఁ దొయ్యలి తప్పు నెఱింగి వెచ్చ నూ
ర్చి మొగము వంచె; మోద మెస లేఁగ నరేంద్రుఁ డెఱుంగఁ దీక్షితిన్.

చ. నిరుపమభక్తియుక్తి జననీజనకానతి వేఁడి యగ్రజుం
దరియఁగ నేగి మ్రొక్కి పినతమ్ముని బిగ్గఁ గవుంగిలించి చె
చ్చెఱ సహపాఠకోత్తములఁ జేరి విచారము మాన్పి యాశ్రమాం
తరమృగశాబపాదపవితానముఁ గాంచుచుఁ జేరె భూవిభున్. 21

తే. గీ. మునిని వందించి తనచేయి మొదవు లొసఁగి
యరదమందు శునశ్శేఫు నలవరించి
యంబరీషుండు పయనించె నాశ్రమాయ
జనులదృగ్జాలమాత్రమే సాఁగనంప. 22

ఆ. వె. మలుపు తిరిగి చెట్లమాటునఁ గడుఁ దిరో
హితతఁ గాంచుదనుక హితులు గనిరి
విరతి లేక కొరలు వేడికన్నీటిచే
సుతుని గాంచ రైరి పితరు లకట! 23

మ. చిరకాలంబుననుండి నేఁటిదనుకన్ స్నేహించు నైజాశ్రమాం
తరభూభాగము దూర మైనకొలఁదిన్ ధైర్యంబు డెందంబునం
గరఁగెన్ నీరయి పాఱె నింకె నటఁ బల్కన్ రానిభావం బెదో
మెఱసెన్ నిల్చెను సాంద్ర మై పెరిఁగె సంపీడించె నబ్బాలకున్. 24

ఉ. గట్టిగ యూపమందుఁ దను గట్టెద రంచును, జేరి యాజకుల్
పట్టి శరీరముం దునిమి పావకకీలల వేల్తు రంచుఁ దా
దొట్టి సుధీరతాగరిమ దూరముగాఁ దరలన్ ఋచీకుమే
ల్పట్టి తలంచుచు న్వడఁకెఁ బ్రాణము లెంచఁగ నెంతతీపియో! 25

కం. "స్వాహా" యని యగ్నిం దన
దేహంబును గోసి వేల్చుతీ రెదఁ దోఁపన్
హాహాకారముతో నృపు
బాహాయుగి మౌనిసూనువరుఁ డత్తమిలెన్. 26

ఉ. అత్తమిలన్ ఋచీకతనయాగ్రణి నెంతయు నంబరీషరా
జోత్తముఁ డప్పళించి హృదయోపరిహారివిశాలసీమపై
హత్తి భయాకులాననకళావళి పూర్వవిలాస మీనఁ గ్రొ
మ్మొత్తనిపల్కులం జిలికి మెల్లన నాతని గుస్తరించుచున్. 27

చ. చని చని యావనోత్కటనిశాతితభానుమయూఖధాటిచేఁ
దనువున ఘర్మబిందువులు దాఁకొన నించుక సేద దేర నాఁ
గె నొకవటోరుభూరుహముక్రింద సహానుగతానుజీవిమో
హనరచితోపకారికఁ జలానిలబాలకు లోలగింపఁగన్. 28

ఉ. అంత ఋచీకనందనుఁడు హస్తగృహీతసమిత్కుశున్ నిజో
హాంతపథంబుఁ బట్టి చనునాతని మాతులకౌశికాత్మజున్
వింతగఁ జూచి వానిదరి వేగము చేరి కథించి యాత్మవృ
త్తాంతముఁ; జెంతఁ గౌశికమహాశ్రమ ముంట నతండు దెల్పఁగన్.

ఆ. వె. జీవితాశ సుంత చివు రెత్తఁ జిత్తమం
దంబరీషకడకు సరిగి మేన
మామఁ జూచి వేగ మఱలి వత్తు నఁటంచుఁ
బలికి మఱఁదినెంటఁ బయన మయ్యె. 30

చ. గళితసమాధిసుప్తుఁ డయి కన్నుల నప్పుడ విచ్చి చూచుమా
తులునిపదంబులన్ మునిసుతుండు నెతారము వెక్కసంబుగాఁ
బలుకఁగ లేక వ్రాలె ఘనబాష్పకణంబులు రాల; బావ తన్
బలిమిని మస్తరించుదురవస్థ సమస్తము విస్తరింపఁగన్. 31

ఉ. ఉల్లము జాలిఁ దూలుటయు నొప్పరికింపక సంభ్రమించి మే
నల్లుని లేవ నెత్తి హృదయంబున హత్తి; నిరాకరించి మై
తల్లడపాటు; రక్షణవిధానముపొంటె సుతాంతరంగముల్
జల్లు మనంగ గాధిమహీశాసనసూనుఁడు వల్కె నీక్రియన్. 32

మ. కనులారం గనినారు మీరె నుడువంగా రాని యీహూని బా
లునికష్టాంతకథావిధానమును; మీలో నొక్కరుం డాత్మలో
ననుమానం బణుమాత్రముం గనక యాగావిఘ్నతాకాముఁడై
చనుఁడీ పీనికి మాఱుగాఁ బశువుగా, స్థైర్యం బవార్యంబుగన్. 33

మ. తలిదండ్రుల్ గలవాఁడెయయ్యుఁ గడుసోదర్యుల్ గలాఁడయ్యుఁ బె
బ్బలగంబుం గలఁ డయ్యు దీనుఁ డగుచుం బ్రాణప్రదానార్థమై
వెలితిం బొంది మదంతికంబునకుఁ దా వేంచేసె నీతం డయో
కలఁగం బాఱిన లేతగుండె వగులం, గాపాడుఁడీ పుత్రకుల్! 34

తే. గీ. తమకుఁ గలదెల్ల ముదముతో ధారవోసి
మిగుల సహమించు దాతలు మించు లజ్జ
మిమ్ముఁ గని యుత్తమాంగముల్ మిగుల వంప
వీనికై దండనాంగ మర్పింపుఁ డయ్య. 35

ఉ. కిన్నరకష్టిణి లోలిఁ బలికించుచు మూర్ఛన లుల్లసిల్లఁగాఁ
గిన్నరపాటలాధరలు గీతిక మీఁపయి నాలపింతు రు
ద్యన్నవలీల స్వాగతిక లై సురనాగరలక్ష్మి ప్రీతి న
భ్యున్నతిఁ గౌఁగిలించుఁ జను లుబ్బ భుజాయుగళంబు సాఁచుచున్.

కం. నా తనయులు మీ రని జన
మీతఱి భాషించుచుండి ; రీకృతి సేయన్
మీతండ్రి కౌశికుం డని
యాతతతోషమున నందు రది చాల దొకో! 37

తే. గీ. తెల్ల మొనరింపుఁడీ సుకృతీగతాయు
వనెడు నార్యోక్తి సార్థకం బనుచు జగతి
నగ్రతృణలంబమానసీహారశీక
రోపమానాసుతతి నింత తీపి యేల? 38

మ. అని యేమేమియొ గ్రుక్కఁ ద్రిప్పక యుపన్యాసమ్ముఁ గావింపఁగా
జనకుం జాల నిరాసనంబుగ మధుష్యందాదు లీక్షించి నీ
తనయానీకముఁ బాసి యన్యసుతుపై దాక్షిణ్యముం జూపు నీ
పను పాహారమునన్ శ్వమాంసముగతిన్ వర్జ్యంబు తండ్రీ! యనన్.

శా. ఏ మేమీ యిఁటు ప్రేలుచున్నయది మీ రేనా? శ్వమాంసంబుతో
మామాటల్ పురుడించినారఁటె! శునీమాంసమ్మె భక్షించుచున్
భూమిం ద్రిమ్మరుఁ డావసిష్ఠజులటుల్ పొం డంచు శాపించె వి
శ్వామిత్రుండు కుమారవర్యుల మధుష్యందాదులన్ నల్వురన్. 40

కం. పిమ్మట బుచీకనందను
పిమ్మట వాయంగ భీతివేపితమ్మఁను కా
యమ్ము నిమిరి వాకొనె వే
యమ్ముని యీవైఖరిన్ రహస్యోక్తులతోన్. 41

తే. గీ. రక్తమాల్యాను లేపనసక్తుఁడ వయి
పరమపావనపాశసంబద్ధుఁడ వయి
మెలఁగి వైష్ణవయూపసమీపజగతి
స్థిరత సప్తార్చి నిటులు ప్రార్థింపు మయ్య. 42

కం. నే నుపదేశ మొనర్చెద
గానం బొనరింపు దివ్యగాథాయుగళిన్
భూనాథుఁడు యాగఫలం
బూను; సురలు మెత్తు; రుసురు లుండును నీకున్. 43

మ. అని యస్మానితనూజకర్ణమున దివ్యద్దివ్యగాథాయుగిన్
నినిచెన్ గాధిసుతుం డతండు నృపమానిం జాల వందించి తాఁ
జనిమెం దన్నుఁ గ్రయించియున్నధరణీజానిన్ సమీపించి యా
తనితోఁ దత్పుటభేదనంబున కమండ్రపాశితానందుఁ డై. 44

మ. "అలవోకం జనుదెంచినాఁడు భవితవ్యావస్థఁ జింతింపఁడే
బళిరా! పెండ్లికొమారువావిరిగ నీబాలుండు రాజిల్లు; మై
చలనంబుం గనఁ డొక్కమాఱయిన నిశ్వాసంబు సారింపఁబోఁ
డళుకే నేరఁడొ యేమొ వీఁ" డని సదస్యగ్రామణుల్ చూడఁగన్.

మ. చిఱునవ్వుల్ చెరలాడ మోమున శునశ్శేపుండు రక్తస్రజాం
బరముల్ దాలిచి మంత్రపూతతమయూపస్తంభసంబద్ధుఁ డై
వరగాథాయుగముం బఠించు నెడలం బ్రత్యక్ష మయ్యెం దమిన్
హరి దిక్పాలకపాలితోదుత రహస్యస్తోత్రసంప్రీతుఁ డై. 46

మ. కరుణాపూరము వేయికన్నుదొవలం గారన్ శునశ్శేపునిం
బరమాయుఃపరిపూర్ణుఁ జేసి ఋషులన్ లాలించి భూనేత క
ధ్వరసిద్ధిన్ హావణించి తత్ఫలము సంభాళించి యేగెం బురం
దరుఁ డాశాపరిపాలకావలితుఁ డై నాకావనీసీమకున్. 47

ఆ. వె. మాతులాతివేలమహిమాతులశ్రీలఁ
జాక నిలుచు నాఋచీకసుతుఁడు
విపులభక్తి రాచతపసిని దర్శించి
పయన మయ్యె నిజనివాసమునకు. 48

తే. గీ. ఆత్మజాతుల శాపోపహతులఁ జేసి
తనదుసహధర్మిణిన్ రాజధాని కనిచి
కౌశికుండు తపించె నఖండలీలఁ
బట్టుదల గ్రాల నొకవేయివత్సరములు. 49

చ. నిరవధికక్రియం దపము నిశ్చలలీల నొనర్చునాతనిం
దరియఁగ నేగి మాటికిని దామరసోదరపాకశాసనుల్
చిరము తపింప నేల ఋషిసింహుఁడ నైతివి నా నతృప్తి లో
విరియఁగ గాధిసూతి పెదవిన్ విఱిచెన్ సనిరాసనంబుగన్. 50

ఉ. మౌని తపించి యీగతి సమల్ పదివందలు; పిమ్మటన్ వ్రత
స్నాన మొనర్పఁ బుష్కరవిశాలతటంబున కేగుచుండఁగా
మేనక యన్సురాంగన సమీపమునందు సఖీజనంబుతోఁ
గానఁగ నయ్యె మౌని తటకాపడి యంగపుటంగముం గనన్. 51

చ. మనసునఁ జేయి నెట్టి పలుమాఱులు దేవినశేవ; నేమొ తోఁ
చనిగతిఁ దేపతేపకును జక్కిలిగింతలు వోవునట్లు లా
ముని యిటు చాల సేలుపడి ముచ్చముడింగి వసించె నున్నచో
టనె పులకల్ సెలంగఁగ వడంకుచుఁ జెమ్మట ముమ్మరింపఁగన్. 52

మ. అరయం జాలఁ డొకింతయేని చ్యవమానాంశోత్తరాసంగముం
బరిశీలింపఁడు సుంతయుం గరకదండభ్రంశముల్ తన్నె దా
మఱపుం జెందెను మౌనిచందిరుఁడు తన్మారాశుగావిద్ధుఁడై
సురవారాంగనపై విరాళి బరువై జొబ్బిల్ల నిచ్ఛాగతిన్. 53

చ. చలనము నందఁబోక వెలచానజగా మొగమందు మంపు మై
నిలిచినరాజతాపసకనీసిక లించుక కత్తరిల్లి; కం
చులిక రవంత పీల రుచి జొబ్బిల యుబ్బు వెలార్చుగబ్బిగు
బ్బలపయిఁ గుప్పిగంతుకొనెఁ బల్మరు కక్షము లంటి వచ్చుచున్.

కం. కిల కిల మని వేలుపువెల
వెలఁది పచారింప నవ్వువెన్నెల, మునియుం
జెలి ననుకరించు మించిన
వలపున దర్పణమునందుఁ బ్రతిబింబమటుల్. 55

సీ. పదియాఱువన్నియబంగారుటరటాకుఁ
బోలువెన్నున వేణి పొరలునపుడు
మగరాలకమ్మలజిగిడాలు గోజ్జంగి
రంగుచెక్కిళుల జీరాడునపుడు

నపుడపు డేతెంచు నల్లితెమ్మెరలచే
మెఱుఁగుముంగురులు కంపించునపుడు
జంపారునడలచే జతగూడి రారాపు
గుబ్బల హారముల్ గునియునపుడు
తే. గీ. జాపకాగ్రణి మెయి జల్లు జల్లు మనియె
గుండియలు వేగఁ దటతటఁ గొట్టుకొనియె
నరుల నుఱ్ఱూఁత లూఁగించినట్టిదిట్ట
కాంత చెంగటఁ బూరికిఁ గాకపోయె. 56

తే. గీ. రమణిరమణీయశ్రోణీభరమ్ముఁ గాంచి
విపులపులినవిహారమ్ము విస్మరించెఁ
గలితతటినీతరంగావగాహనమ్ము
మాట నాచెలివళిఁ గాంచి మఱచె మౌని. 57

కం. ఒసపరిగడుసరిచనుఁగవ
పసబరువున నించుకంత వంగి నడచున
బ్బిసరుహనయనం గని తా
పసవరుఁడు విరాళిఁ దూలి వడి నిట్టూర్చెన్. 58

ఉ. కో యని కోయిలల్ చివురుఁగొమ్మలచాటున నిల్చి కూయ నా
తోయజగంధి తన్ను దనకోడివయస్యలు పిల్చుచున్న వా
రో యని మోముఁ ద్రిప్పి కన నొత్తిగిలుం బొదరింద్లపజ్జ కా
పోయగ మెల్ల జంకుగొనుచూపులతో గిలుబాడె మౌనియున్. 59

ఉ. కప్పురగంధితోఁ దనకుఁ గల్గిన మోహముఁ బుక్కిలింపఁగా
నెప్పరమందుఁ గౌశికమునిప్రవరుండు; తపోంతరాయముల్
దొప్పలుదోర లాముకొని తోఁప నవాంతరకామితంబుఁ దా
నొప్పరికించు; నంతటనె యువ్విళు లూరఁగ నంగనం గనున్. 60

కం. అపవర్గము సాధింపఁగఁ
దపమునఁ జరియింప నాత్మఁ దలఁపక మఱి య
చ్చపలాక్షి నభిచరింపఁగ
నుపసర్పింపక విశాఖ నోలాఖు తగన్. 61

తే. గీ. శిఖను జన్నిదముఁ విసర్జించి చిరత
రానుగత మైనగార్హస్థ్య మవలఁ ద్రోసి
న్యాయసమ్మతసన్న్యాస మందుకొనని
యుభయధర్మచ్యుతుం డట్టు లుండె నతఁడు. 62

తే. గీ. విషయతత్త్వాంతరంబున బెసుకకుండ
వెలసెఁ దపసి; యయస్కాంతవిపులశక్తి
యిరుగడలనుండి సమముగా నీసరేఁగఁ
గదలనేరని యాయసకణిక వోలె. 63

మ. అహిరంం డైనయరుంధతీధవుఁడు నయ్యాటింపఁగా నీగతిఁ
మహిళారత్నముఁ గౌఁగిటం బొదివి బ్రహ్మత్వమ్ము భంగింతునా ?
మహిలో నేనరుఁ డేమ్ర పేలుకొనినం బాటింపఁగాఁబోక నా
యిహసౌఖ్యంబు గడింతునా? యనుచు ని ల్లింతేని యోచించుచోన్.

కం. కో యని కోయిల కూసెం
గో యని మరుఁ డెత్తె విరులకోదండంబుం
గోయనికోతగ నట్టు లా
క్కో యని ముని మనికితమునఁ గుతికిలఁబడియెన్. 65

మ. ఎవఁడో యేదియొ యాడిపోసికొన నా కేమాయె సిద్ధాన్న మీ
పువుఁబోఁడిఁ దరిసించి నాప్రణయముఁ బోధించి భోగింపఁబో
కవురా ! యెన్నఁటికో లభింపఁ గలబ్రహ్మత్వమ్ము గిహ్మత్వముఁ
మివులం గైకొని ప్రాఁకులాడఁ దగ వౌనే యంచు భావించుచున్.

శా. నీకేజానన పుష్కరంబున వడి న్నీరాడఁగా నేగ బ
ల్మాఱా సైకతమేదిని న్నడువఁగా మంజీరయుక్తమ్ముగాఁ
బారాణించినపాదయుగ్మము కటీవక్షోరుహాపారభా
రాకృష్టిన్ మిటిమీఱఁ గూరుకొనిపో నావాలుకం జూచుచున్. 67

చ. తటుకున లేచి కౌశికుఁడు దండకమండలువుల్ గ్రహించి య
క్కుటిలవినీలకుంతలను గూఢముగా దరియంగఁ గోరి త
త్తటమున నున్న పూఁబొదలదాపునఁ దప్కుచుఁ దారునుం గడున్
విటతట మైనదోవతిని వేమఱుఁ దా సవరించుచుం జనెన్. 68

కం. నీరాడు రేవునకుఁ బది
బారలదూరమునఁ బొదలు బలియఁగ నీడల్
గాఱుకొని యున్న యొకసహ
కారాగమమూలజగతిఁ గౌశికుఁ డణఁగెన్. 69

ఉ. వేనలియల్లికన్ వడిగ విప్పుచు బోఁటులఁ దీవరించుచున్
మేనక చుట్టుపట్లఁ గను మేరఁ బరుల్ గలరేమొ యంచు వీ
క్షానికరమ్ముఁ జిమ్మి జలక మ్మొనరింపఁగ రేవు డిగ్గె నెం
తే నమితాంగి యామ జలనీలిని బాయఁగఁ బాయఁద్రోయుచున్.

తే. గీ. మేనకాసారసానన మిగుల మోక్ష
పదముఁ గామించి పుష్కరవారి మునిఁగె
మదనసామ్రాజ్యపదము నెమ్మదిని గోరి
తరుణిలావణ్యసరసిలోఁ దపసి మునిఁగె. 71

మ. కలహంసావళి చాల భీతిలుచు ఱెక్కల్ విచ్చి నల్మూలలం
గలఁగంబాఱుచుఁ బాఱ జక్కవపవల్ ఘూర్ణించుచున్ నెచ్చెలుల్
జలముం జేతులఁ జల్లులాడుకొనుచున్ సయ్యాటలం దేలుచున్
బలకాయించినలీల మేలముల సంభాషించుచున్ మున్గుచున్. 72

సీ. తమ్మిపూ రేకులఁ దారాడుతు మ్మొదల్
చెలరేఁగ నీరముల్ చిమ్మి చిమ్మి
వారకె జక్కవ నా కిదో యంచు నీఁదుచు
న్నట్టిప్రోడలచనుల్ పట్టి పట్టి
మకరంబు లీచంత మసలఁ జూచితి నంచు
నొగి మున్గి పదములఁ దిగిచి తిగిచి
వెనుకపాటున వచ్చి వేనలికిన్ నాచు
ముడివెట్టి యది పట్టి మునిఁగి మునిఁగి
తే. గీ. యంగరాగంబు కరఁగి బల్ రంగు లీన
శ్రమముచేత సమున్నతోరస్థలంబు
లుబ్బుచుం దగ్గుమండ బిట్టూర్చుకొనుచు
హాళి నలనాక జలకేళిఁ దేలి రంత. 73

మ. పరివేషంబులు గట్టఁగా నెఱజిగాబంగారురంగారుడా
లురుదారం దడిచేత నంటుకొనుపయ్యంటం బిసాళించుచున్
బరువై బల్బిగువై బటార మయి సంవాసించి కన్గట్టఁగా
దరిసించెన్ ముని మేనకారమణినిద్దారాపుచన్నుంగవన్. 74

ఉ. పల్లటిలం బదన్యసనపద్ధతి; చిత్తడిభార మందుచుం
ద్రుళ్లుచుఁ గాళ్లు కడ్డుపడి నూలొకొను మేల్ జరబాజుచీరకు
చ్చెళ్లు రవంత యెత్తి యఱచేతఁ బదిం బది యొత్తి పిండుచున్
మెల్లఁగ నెక్కె తత్తటముమీఁద నిలంబడి మాటిమాటికిన్. 75

ఉ. లెందుడుకుల్ గడంకొనఁగఁ దుంటరిగుబ్బలఁ, దళ్కుఁజెక్కులం
జిందులు ద్రొక్కఁ గమ్మగవ, నిద్దపుఁగొ నసియాడ మేనకా
సుందరి తేమగిల్లుశిరసున్ వలిపెంబున నొత్తి రాయు న
య్యందముచందముం దపసి యారసి హా! యని బిత్తరించుచున్.

కం. గిలిగింత లురల నెమ్మది
గిలికించితరసము కొసరి కెరలన్ నెఱిమై
పులకించి గలతరింపం
బులపొడుచుచుఁ బొలఁతి కెదురు వోవఁగ లేచెన్. 77

చ. తొలుకున మాని లేచుటయు దాపున నున్నశశంబు భీతిచే
నిటు నటు దాఁటు ఛాలి పసుపండినయాకులమర్మరధ్వనుల్
పొటమరిలంగ; నాసడికి లోగినకోయిలజంట తుఱ్ఱునన్
విటతట మూఁచుఁ బాఱె సురవేశ్య చటుక్కునఁ జూచె నాఁడెసన్.

ఉ. చూచినతోడనే తనదుసోయగ మెవ్వఁడొ పూరుషుండు ప్రే
రేచినబాళిఁ గాంచుట లెఱింగి త్రపాభర మావరింప సం
కోచముతోఁ బయంటఁ జనుగుట్టల మాటఁగ మాటిమాటికిం
జూచెను గాని చిత్తడులు జొత్తిలుచేలము మాటు సేయమిన్. 79

చ. అరుణకరాభిమర్శమున నారఁగ విచ్చినకుంతలమ్ములం
జెరిసగ మానటుల్ వడిగఁ జీలఁగఁ దీసి బిరాన మల్చి పే
రురమునఁ గప్పి యూపయిన నొప్పఁగఁ గత్తెఱతీరు గాఁగఁ గూ
ర్పరయుగిఁ దార్చి హత్తి రొముకప్రక్కఁగ నామె మలంగి నిల్వఁగన్.

ఉ. పుంజికొనంగఁ గమ్మవలపుల్ గుదమూరఁగ నొండు రెండు మూఁ
డంజలలోన మేనక వొయ్యారముగా నిలుచున్నతావుఁ జే
రెం జతకోర్కియుక్తి నలరింపఁ నిలాతలజానిమాని; మేల్
పంజులకమ్మ లూఁగ మునివంకకు మో మఱఁద్రిప్పె నామెయున్.

కం. ఇలపై వల దులుపం బలు
కిలకం జిలికించు మీల గ్రేఁచు జగా
చెలు వొలయు చెలియ మునిపైఁ
బలు తెరఁగులఁ బోహళించె వాలుంజూపుల్. 82

చ. మనమున నున్న ప్రేమము నమాంతముగాఁ జెలికిన్ ముఖాముఖిన్
వినిచి కృతార్థుఁడై యనుభవింపఁగ నువ్విళు లూరుచున్నయ
మ్మునియొకమాటయైన మొగమాట మొఱిన్ మొగరింపఁ బల్కలే
కనిమిషతన్ భజించె హృదయంబు చలింపఁగ నూర్పు లాఁగఁగన్.

మ. తనియం జేసెను మౌనిమానసము నంతన్ మేనకామోహాసం
జనితంబుల్ చిఱుచెమ్మటల్ మృదులలజ్జాసంపదల్ తీయతీ
యనియూర్పుల్ పులకోదయంబులును హాసాంకూరముల్ కొంకుచూ
పునివాళుల్ తలవంపుసొంపులును మంపుల్ లేతడగ్గుత్తికల్. 84

ఉ. భామినిచేష్టలం బ్రణయభావము బాహిర మౌట సాహసం
బాముకొనంగ నాముని రయమ్మునఁ దత్కరమున్ గ్రహించి "యో
యామరకామినీ! యెఱుఁగవా? నను నూతననాక" మంచుఁ దా
సాము వచించి యాఁగె విరసం బగునో యని సంశయించుచున్. 85

మ. శిర మొక్కింతగ వంచి బుగ్గ లుబుకం జిన్నారిపొన్నారిన
వ్వురళింపన్ నునుసిగ్గుదొంతరలచే నూటాడువాల్జూపులం
గురియించెన్ సురవారనారి మునిపైఁ గొంచించుచున్ నెచ్చెలుల్
పరిశీలించెద రేమొ యన్నటులఁ బల్మాఱా దెసం గాంచుచున్. 86

కం. ఆరసి చూపులభావం
బారసికతపస్వి లతల నావేష్టిత మౌ
పారనికుంజముఁ జేర్చి వి
సారవిలోచనను దీమసం బాముకొనన్. 87

మ. తల వంపం బని యేమి సిగ్గుఁ గొని కాంతా! యంచుఁ జెక్కిళ్ల నం
గుళుల న్నొక్కుచుఁ బైకి నెత్తె; ననుఁ గన్గొనీయఁగా రాదఁటే
యళికం బంటును ముంగురుల్ సరద; మీనాంకార్తిఁ దూలింపవే
చెలియా! యం చెద గుబ్బ లొత్తుకొన నాశ్లేషింపఁగా నిగ్గుచున్.

సీ. కెమ్మోవి నానఁ గాంక్షించి చేరఁగఁ దిర
శ్చీనాస్య మై నునుజెక్కు నొసఁగి
బుజముపైఁ గర ముంచి బుజ్జగింపఁ జెమల్చు
నెపమునఁ జెయిఁ గుచమ్ముపయిఁ ద్రోసి
చంద్రోయిపైఁ జూపు సారింపఁ గప్పెడు
వ్యాజంబుచే నాభి బయలుపఱిచి
చక్కిలిగింతల సంతరింపఁగఁ గాచు
నట్టు లురస్సీమ నత్తమిల్లి

తే. గీ. వలపు దోలుకాడ ముని యొకపనిని జేయఁ
బూన వారించుమిషఁ బూని దానికంటె
నగ్గలం బగుపనికి నాయత్తపఱిచి
మగువ మిగులంగఁ మదనాగ్ని రగులుకొలిపె. 89

ఉ. ఆసమయంబునన్ జలవిహారములం గడుఁ బూరగించి యా
యాసముతోఁ దటిం గదిసి యంగములం గయిసేసి యంగనల్
మీసర మైనలీలఁ దమమేనకఁ గానక కేకరించుచుం
దూసిరి నాల్గుదైపులకుఁ దొట్రిలుచున్ మది నంగలార్చుచున్. 90

తే. గీ. ఏఁక మేనకపేనుల సోఁక నొక్క
చెలియమంజీరమంజులసింజితమ్ము;
ఉలికిపడి బిగియూరుకౌఁగిలి సడల్చి
వేగిరించి మునిం బొదన్ డాగురించి. 91

తే. గీ. చెదరి యున్నట్టియలకలఁ గుదురుపఱిచి
గుబ్బచన్నుల నలరారు క్రొత్త క్రొత్త
కలికిచిట్టంటులం జెలుల్ గానకుండఁ
బైఁట దళముగ సవరించి పయన మయ్యె. 92

కం. "విలపించుబాలుచేతికి
ఫల మొం డందిచ్చి యపుడె బలిమిం గొనున
ట్లలరించి యాస లెదలో
మొలిపించి పరిక్రమింపఁ బోలునె ? నీకున్. 93

మ. అనుచుం బయ్యెదకొంగు వట్టుకొని దీనాస్యంబుతో జాలిగాఁ
గనుఁగొంచుం బతిమాలుకొంచు వెనువెన్కన్ రాఁగ నాఁతాగ యా
మునిచేతం జెయి వైచి బాసఁ గొని "నన్నోర్చని మ్మోదన్ వేఱుగా
ననుమానింపకు వేగ వచ్చెద మహాత్మా!" యంచు నేగెన్ వెసన్.

తే. గీ. సాంగవిచికిలనయనకంజములలోనఁ
గొంత సందియమున్ మఱికొంత యాస
కందళింపఁగ నిలిచె నక్కౌశికుండు
తరుణి వోయినదారి నెంతయును గనుచు. 95

కం. చిలుకలు పలుకఁగఁ గెలఁకుల
నలరుల నలికులము మెలఁగ నలసత వెడలన్
వెలవెలఁది వచ్చె నని కని
వెలవెలవోవుం దపస్వి వితథార్థుం డై. 96

ఉ. ఇంతులమిన్న యేగె నిపుడే చనుదెంతు నఁటంచు; వచ్చునో
కాంతలఁ గూడి యేగునో ? మొగమ్మున నన్ గికురించుచిన్నె లా
వంతయుఁ గాన; మేమొ వెలయాలు గదా !" యని పూర్వపక్షసి
ద్ధాంతము లాచరించె నతఁ డారయుచుం బొద నొత్తిగించుచున్.

ఉ. అచ్చట మేనకాకువలయానన తన్నరయంగ వచ్చిన
య్యచ్చరమచ్చెకంటికి సమగ్రముగాఁ గలసూపుఁ దెల్పి "నే
నిచ్చట నావసించెద మునీశ్వరు సానతిఁ జేసి మీరలున్
వచ్చుచుఁ బోవుచుం గుశలవార్తల నాకెఱిఁగింపుచుండుఁడీ. 98

చ. ఇచటికి తెమ్ము నాతొడవు లెల్లను వస్త్రము లంగరాగ, మే
నచటికి రాఁ దలంపఁ బరియాచకముం బచరింత్రు నెచ్చెలుల్
విచికిలసుందరాస్య లయి వేశ్యల కీగతి చెల్ల దంచు సం
కుచితతరాంతరంగ లయి; కోరికఁ దీర్పుము పొమ్ము కొమ్మరో. 99

చ. అని బతిమాల నాయువతి యామెతయానతి నిర్వహించి వా
రనిగతి నేగెఁ బ్రీతి నమరావతికిన్ మునిరీతిఁ దోడికా
మినులకు వక్కణించి; యట మేనకయున్ ముని వేచియున్న తా
వును వెనువెంటఁ గదిసి మూయఁ దదీయవిలోచనద్వయిన్. 100

చ. తడుముచు బాహుమూలములదాఁక నెఱుంగనివానిపోలికం
బుడుకుచు నల్లనం బొగరుఁబోతుచనుంగవ; నంస మంటి రొ
త్తిడిఁ గలిగించి వంచుచుఁ గదించి మొగమ్మున నామె మోము ము
ద్దిడె ముని కామినిన్ నగుచు నిగ్గుచు నామె పెనంగులాడఁగన్.

మ. గిలిగింతల్ పచరించి కౌశికుని కెంగేల్పట్టుఁ దూలించి య
వ్వొలవాల్గంటి యొయారమారఁ బఱచెన్ వెన్నాడఁగా హానియున్
వలిగయ్యాళిపిసాళిచన్నుఁగవపైఁ బల్మాఱు హారావళుల్
బలకాయించుచుఁ దన్ని మూఁగ నగ వొల్కంగం గళాసించుచున్.

కం. ఇవ్విధమునఁ బరవశులై
యువ్వనజానవయు జావకాగ్రేసరుఁడున్
గువ్వలవలెఁ గులుకుచుఁ గడు
మవ్వ మెసఁగఁ జేరి రాశ్రమస్థలి బాళిన్. 103

చ. అరయఁగ వచ్చి మేనకకు నప్పన సేయుదు రంగవించుచున్
సురటులు గంబురావలపుజొబ్బిలుబాగలు సొంకవమ్ము ల
త్తరుపులకుప్పెలున్ మృగమదమ్ములుఁ దమ్ములపాకుకట్టలున్
నెఱిజిలతారుచీరలు ననేకము లామరకామినీమణుల్. 104

శా. నీ రేజానన కాముసేంద్రమణి తానే యన్వహం బెంతయుం
బారాణించుఁ బదమ్ములన్, మకరికాపత్రమ్ముఁ జిత్రించు సు
స్మేరోదారకపోలసీమఁ, గురులన్ స్నిగ్ధమ్ముగా దువ్వి పూ
చేరుల్ గూరిచి కట్టుఁ, గజ్జలము నిక్షేపించుఁ గన్నుంగవన్. 105

చ. మడమలఁ ద్రొక్కి నొక్కిపరి మానినికిన్ జడ నల్లి పూని యా
బెడఁగు రుచింపనున్కి జడ విచ్చి కడుం దల మీఱు జాఱుక్రొ
మ్ముడిని ఘటించి తృప్తిఁ గనఁబోక విమోచన మాచరించి లోఁ
జిడిముడిపాటు నందు నెఱ సేయుటకున్ మదిఁ దోఁపకుంటచే. 106

తే. గీ పత్రభంగమ్ముఁ జెక్కిలి వ్రాయువేళ
మేలిగంబూరగులుకుబాగాలు తముల
పాకుమడుపుల ముని నోటి కందియిచ్చుఁ
గలికి రారాపుఁబొలింప్లగచ్చులాడి. 107

తే. గీ. ఈనిశీథిని మనకు నెంతేని హాయిఁ
గూర్చె నన ముని; జాణ పక్కు మని నవ్వి
కౌశికానందకారిణి గాని యెట్టు
లస్మదాదుల కగు నంచు నపహసించు. 108

చ. "కనుఁగొనలేదె నేఁడు తటకాపడి నగ్నవచ్చు మత్స్యభి
జనమున నొక్కదానిఁ; బెలుచం బలవించితి దానిఁగూర్చి; నేఁ
గని విని యుండ సాక్ష్యములు గావలెనా? శఠ!" యంచు మోదు జ
వ్వని జడ నామునిన్ నిదురఁ బాపి పునారతిఁ గోరె యామిషన్.

ఉ. దూరము గాఁగ నోసరిలి తొయ్యలి యస్ఫుటలీల సిగ్గునన్
మాఱుమొగమ్ముతోఁ "జెఱఁగు మాసె" నఁటంచు వచింప వెల్వెలం
బాఱుచు పూని నిల్వ "మతిమంతుఁడ! నమ్మితివా?" యఁటంచు నా
కైరవలోలలోచన పకాపక నవ్వుచు నంటు నాతనిన్. 110

ఉ. హాయిగ నీవు నే నొకటి యై సుఖయింపఁ గవుంగిలింపఁ బోఁ
ద్రోయుచు నున్న దీగడుసుతుంటరిగబ్బిపిసాళిగుబ్బచం
దోయి యయారె! యీక్షణమె తుంచెద కార్చెద సంచుఁ బట్టఁబో
నాయెలనాఁగ యోసరిలి యమ్ముని చెక్కిలిఁ గొట్టె నవ్వుచున్. 111

చ. మునితొడ దయె తలాడ యయి పుష్కర సైకతసీమ నొరఁగాఁ
జనమణి కామినీమణి పడెంబడి తూరుపుకొండ చెంగటన్
గునియుచు మిన్కుఁ జిల్కు నెలకూనఁ గనుంగొనుచుండ మౌని చూ
పును నెలకూన లామె కొరపుంజనుగొండల గోరు లుంచుచున్.

సీ. ప్రణయకోపములతో మణితకల్పనలతో
మురిపించి యర్పించు ముద్దుతోడఁ
జెమటచిత్తడులతో సీత్కారములతోడ
బిగువారు కౌఁగిళ్ళ సొగసుతోడఁ
గమ్మయూర్పులతోఁ గ్రమ్ములాహిరితోడఁ
గిలకిలనవ్వులవలపుతోడ
జడప్రేటువాటుతోఁ దడఁబడునుడులతోఁ
గెంపువాతెఱయూరగింపుతోడ

తే. గీ. వాలుఁజూపులతో గరుపాటుతోడ
నంగహారంబుతో మేనిపొంగుతోడఁ
బ్రతినిశావసరంబులఁ బైసరములు
గడచె గడనపడంతికిం గౌశికునకు. 113

చ. "ప్రణయము బో వెలందులకుఁ బైకము, కోపము నీదుసొమ్ము, నా
ప్రణయము నీదుకోపము నపారవిలాసిత మేళవింప నో
గుణనిధి! యయ్యెడం బ్రణయకోప మతీతవిచిత్రపద్ధతిన్
మణితము గ్రాల నేలు" మనుమౌనిని మానిని పూపనవ్వుతోన్.

ఉ. పాటలమంజులాధరముపై నురళించెడు పచ్చిపచ్చిప
ల్కాటులఁ జూచి చూచి చనులన్ బిగితమ్ముగఁ బట్టి పట్టి కెం
గోటులపోటుదాఁటులను గూర్చినచొప్పును జూచి చూచి యా
బోటికి మాటికిన్ నగుచుఁ జూచు మునీశ్వరుఁ బుల్కపుల్కనన్.

ఉ. చెక్కిట నింతి ముద్దుఁగొని చిందినతమ్మరసంపుసొంపుతోఁ
జిక్కఁగఁ గౌఁగిలించి విరచించినయంగదగాఢముద్రతోఁ
జొక్కి మొగమ్మునన్ మొగముఁ జొన్పఁగ నంటినకజ్జలమ్ముతో
నెక్కొనుటీల స్నానమున కేగుఁ బ్రభాతమునందు మౌనితాన్. 116

చ. బొమముడిపాటు పాటిలఁగ మోవి యొకించుక కత్తరిల్లఁగా
నమలిన మైనయూరుపు రవంత రవంతగఁ బూరగిల్లఁగా
సమదగజేంద్రయాన నెఱజంకెనచూపులఁ బోహళించు సం
యమిపయిఁ బ్రేమభిక్షుకయి యాతఁడు ముంగల మోఁకజిల్లఁగన్.

ఉ. "ఈనిశి నీవు నీ" వనుచు నెంతయు వంతులు వైచి పంతముల్
పూని మొగమ్ములన్ మలఁచి పూనును సెజ్జఁ బరుండి కొంతసే
పానళినాస్యయున్ మునియు నొదల లెత్తుచుఁ జూచి వేఁ బరా
చీనత సంతరింత్రు తమచేఁత బటాబయలౌట సిగ్గునన్. 118

చ. ఇరువురు గుబ్బ లొత్తుచు నహీనగతి న్నిదుర న్నటించి మే
న్వ్రాలుచు నొత్తిగిల్లుచును విస్తృతమంజులపాణిపాదులై
పెనొరసి జరీలునన్ జరిగి యూరువుల న్నిగుడించి మించి వెన్
దిరిగి ముడింగి యుంద్రు హావణింపఁగఁ గ్రమ్మఱ దొంగనిద్దురల్.

చ. జడ జడదారిపైన వెలచాన తురీన గిరాటు వైవ బి
ట్టడలినవాఁడు వోలె నతఁ డామెతపైఁ బడి "పాము పా" మనన్
విడివడ నీవి బిగ్గిలినకోఁక విలాసిని లేచి చన్నులం
బొడిచి కవుంగిలించు మునిముఖ్యుఁ దమిం బొలఁపుల్క జాఱఁగన్.

సీ. పారావతంబులపలుకు లాలించుచుఁ
దరళాక్షి రతికూజితములఁ దలఁచుఁ
జిలుకముక్కులమేలిసింగార మరయుచు
బాహ్మ్యంచుజవరాలిమోవిఁ దలఁచు
నేరేటిపండ్లవన్నియను దర్శించుచు
నెరజాణకలికిపెన్నెరులఁ దలఁచు
మించుక్రొక్కాఱుక్రొమ్మిమ్ము శీలించుచుఁ
జెలియవాలారుచూపులఁ దలంచుఁ

తే. గీ. కూడరాని డాయఁగరాని చూడరాని
ప్రియవధూటిని బాసి పరిభ్రమించుఁ
బొడవు లై తోఁచు నెలలోనిమూఁడుప్రొద్దు
లెట్టులో తఱలింప గాధిరాజేంద్రసుతుఁడు. 121

ఆ. వె. సురతవేళ నిశల జ్యోతిర్లతావళి
వెలుఁగు వారలకును వెలువరింప
మణితరావములకు మాఱురవళించుఁ
గోటరముల నుండుగువ్వపిండు. 122

తే. గీ. వెనుక కౌఁగిట, జడప్రేటు, పెదవివిఱుపు,
మూతిముడుపు, జంకెనచూపు, బొమలముడులు,
నేకవచనసంబోధన, లెలమిఁ గూర్చె
గాధిసూతికి మేనకాకాంత సేయ. 123

తే. గీ. కొట్టుకొనిపోయె దశసమ లట్టిరేయొక్క
గడియలోఁబలె సుదతికిఁ గౌశికునకు
నమితమోదప్రవాహంబునందు నంత
సారసానన యాపన్నసత్త్వ యయ్యె. 124

తే. గీ. మన్నుఁ బ్రాసింప మన సయ్యెఁ జన్ను మొనలఁ
గప్పు మొగరించె నిఱుపేదకౌను పెరిఁగెఁ
జిట్టుములు పుట్టె నలసత చెంగలించె
రతుల నభిలాష లడుగంటెఁ బ్రమద కంత. 125

చ. తల నొడిలోన నుంచుకొని తమ్ముల మా మెతనోటఁ బెట్టుచుం
జిలివిలివోవు రాగమునఁ జెక్కిలి నొక్కుచు ముద్దు లుంచుచున్
జిలిబిలికమ్మమాటలను జెప్పుచు గర్భముఁ జేత దువ్వుచుం
బలుచనిగాజుకాయఁబలె వాడుకొనెన్ ముని మానినీమణిన్. 126

సీ. అధరాధరంబు సంయమి పంట నొక్కుచో
విడువరా యని చాల వివ్వాలించు
మగలాగు సవరింప మౌని సంప్రార్థింప
క్షమియింపు మంచు నంజలి ఘటించు
నెదురొత్తు లిడఁ దాపసేంద్రుఁ డెచ్చరికింప
నతితరాయాసమ్ము నభినయించుఁ
గుతుకాన ముని పునారతికిఁ బ్రేరేపింప
నేఁటికి వల దంచు నిశ్వసించుఁ

తే. గీ. జిన్నవోయిన మోముతో నున్న రాచ
తపసివీపును గెంగేలఁ దడిమి తడిమి
"కోపమా నాపయి" నఁటంచుఁ గుస్తరించి
ముద్దుఁగొను వాసి నావేల్పుముద్దుగుమ్మ. 127

చ. బిగువులు లేనికౌఁగిళులు ప్రీతికిఁ జేరువకానిముద్దులున్
జిగిబిగి లేనిచూపులుఁ జీరికిఁ గైకొనరానినవ్వులున్
మగువలమిన్న గూర్చుటయు మౌనికులాభరణంబు దైన్యముల్
మిగులఁ దురంగలింపఁ గుసిలించుఁ జిరాకు పరాకు మేకొనన్. 128

చ. అమితవివృద్ధగర్భవతి యై తగుమేనకఁ జూడ వచ్చునా
యమరమ రాళియాన లలయాశ్రమసీమ సమావసించి కూ
రిమి నుపచారముల్ సవదరింపఁదొడంగిరి; కాంత కంత నిం
బు మిగుల భాసిలం బురిటిప్రొద్దులు డాసెఁ గ్రమక్రమంబుగన్. 129

చ. ఒకశుభవాసరంబున మహోత్తమతారకయందు నుచ్చలో
సకలశుభగ్రహంబులు నెసంగ సుఖప్రసవంబుఁ గాంచి మే
నక యొకముద్దుబాలికఁ గనద్భ్రమరాలక నిచ్చె వీఁకఁ గా
నుకగ నిలాతలాంగన కనూనవినూతనవేల గ్రాలఁగన్. 130

వ. ఆసమయంబున. 131

చ. "కకవిక లై తపోనియతి గ్రాలఁగఁ గౌశికకాముకాధముం
డొకసురజారిణిన్ మరగి యుంచె నిజాశ్రమసీమ నామె" నం
చెకసకె మాచరించుచు ననేకవిధంబుల నూరువాడలున్
వికవిక నవ్వ నివ్విధిని బేల్పడి చుల్కన యైతి నక్కటా! 132

తే. గీ. నీచకాముకు లెల్ల నన్నే జగానఁ
బురుడుగాఁ దీసికొందురుగాఁబోలు! నింకఁ
"గౌశికుం డంతవాఁడె శృంగారరసము
చిప్పిలం గాంతకౌఁగిటం జిక్కె" ననుచు. 133

ఉ. మేనక నాతపోవిధి దమింపఁగ నిచ్చటి కేగుదెంచిన
ట్లే ననుమాన మూనుటకు హేతువు లేశము లేదు; నేన య
ద్దానిని జూచి మేలుపడి తద్దయు నియ్యకొనంగఁ జేసితిం
గాన మదీయదుష్కృతికిఁ గర్తయు భోక్తయు నన్యుఁ డేనొకో.

కం. ఏమేమో చింతిల ఫల
మేమిం కాఁదలఁచినట్టి దెల్ల ఘటిల్లెన్
శేముషి పూరిన్ మేసెన్
ప్రేమలతం ద్రెంపి ప్రోవు వెట్టెద నిటుపై. 135

వ. అని వినిశ్చయించి విశ్వామిత్రతాపసకులావతంసంబు చివాలున లేచి నిటాలమ్ము నఱచేతఁ గదించి యెడనెడ నాస్ఫోటించుచు నెట్టన నెట్టినఁ డెందమ్మునఁ గమ్మిరించునపరాధవ్యాపారమ్మును బలాత్కారమ్ముగ నాసేధించుచు నలుకవిలుకాని కిం దిఁక నిలువఁ దావు లేదని తెచ్చిపెట్టుకొనుదీమసమ్మున గొణుగుకొనుచుఁ జిట్ట మిడుచుచుఁ బశ్చాత్తప్తుఁ డగుచు నరగలిఁ గొనుచు నూలపూలఁ గుడుచుచు సొటసొట వోవుచు మానసవిహాయసవీథి నసమానభావవిమానపంక్తు లనుపమానపవమానమానసానూనజవమ్మున జివ్వు జివ్వున విటతటంబుగఁ బాఱుచుండ నొకచో నమేరుభూరుహచ్ఛాయ నిటునటు నడయాడుచు నున్నయవసరంబున. 136

ఉ. మేదురమోద మాముకొన మేనక నెచ్చెలి యోర్తు సూనిరా
జాదర మందఁగాఁ బఱచి యాదరబాదర విన్నవించె బా
లోదయవార్తఁ; జిత్తమున నుత్తలపాటును డాగురించి శా
తోదరి నాదరించె మధురోక్తులఁ దాపసి కైతవక్రియన్. 137

తే. గీ. పురిటిప్రొద్దులు వేలుపుఁబూవుఁబోణి
కరిగెఁ గ్రమముగ నమితసుఖావహముగఁ
బరమునైషయికాజ్ఞానవాసరములు
కుశికకులతిలకునకును గూడ నరిగె. 138

సీ. నూనియమెఱుఁగుతో నుగ్గునుగ్గులు దేరి
రమణఁ బూరించుక్రేలుముడితోడఁ
జేపువాఱినపాలచిత్తడిచిన్నెల
చెలువు రూపించుకంచులికతోడఁ
జేలాంచలమ్ముచేఁ జాల బిగింపఁగాఁ
గస్తి నందుచునున్న కౌనుతోడఁ

ననువాక్యమున భుగ్గురని గుబాళించుచు
నెగటుతావులఁ జిమ్ము మొగముతోడఁ

తే. గీ. బసపుఁగాటుకడాగులమిసిమితోడఁ
బూపపాపను బొత్తులఁ బొదివి పట్టి
వింతగాఁ బచ్చియొడలిబాలెంతరాలు
మేనకాకాంత వచ్చె నపస్మానికడకు. 139

ఆ. వె. చిట్టిపాపమోముసింగార మీక్షించి
రెయొక్కమాఱు పూని నోరఁ జూచెఁ
దండ్రిఁ బోలుకన్య ధన్య నా సూచన
గదుర నగుచు మేనకాలతాంగి. 140

ఉ. వచ్చినతన్నుఁ గాంచి నిజబాహులఁ జాపుచు నింతమోముతో
ముచ్చట దీఱ నందుకొను ముద్దులపట్టి నఁటంచు నెంచున
య్యచ్చరచాన పూనమున నానమితాననుఁ డౌచు నెంతయో
ముచ్చముడింగి యున్నమునిపోలిక నారసి యిగ్గె నెక్కుకున్. 141

చ. అనిమిషతావిశేషము బయల్పడ సాంగవికస్వరాక్షి యై
కనుబొమ లెక్కువెట్టి తటకాపడి మేనక గ్రుమ్మరించె దృ
ష్టిని గడు నేకధారగ జటిప్రభుసత్తముపైన నాతఁడుం
గనుఁగొని యొక్కమాఱటు మొగమ్మును ద్రిప్పుకొనెఁ నిరాదృతిన్.

చ. తరుణియుఁ గొంతమేరకు విరాకుఁ ద్యజించి తెగించి సంయమీ
శ్వరుపదనీరజాతములపజ్జఁ గుమారిక నుంచి చీరమేల్
చెఱఁగున నొత్తుచుం గనులఁ జిందులువాఱెడునశ్రుబిందువుల్
మఱిమఱి దూపటిల్లె నొకమాటయు వాకొనలేక భీతిచేన్. 143

తే. గీ. తామసించినఁ గరఁగుఁ జిత్త మ్మటంచు
దండముఁ గమండలువును హస్తమునఁ దాల్చి

చివ్వన౯ లేచి యమ్మౌనిశేఖరుండు
పలికెఁ జెలికాఁడ నిటు కటుభాషణముల. 144

చ. కఱకుకడిందితాపమెడఁదకౌశికునే కరఁగించియుంటి వీ
వరనియమమ్ములో నొకకటాక్షలవమ్మునఁ జెల్ల! చెల్లె మ
న్నిరతతపస్క్రియాఫలము; నీకును నాకు ఋణానుబంధముల్
సరి యిఁక నేఁటితోడ నెఱజాణలు వో వెలచాన లన్నిటన్. 145

చ. "వ్రతములు నూఱుఁ గూడ నొకయంకునఁ బోయె" నటన్న సామెత౯
వితథమె యయ్యె నస్మదతివేలతపఃపరిపాక మెల్ల నీ
కతన; మదీయదోషమును గల్గుట నిన్ను శపింప నైతి యు
వతిమణి! నన్నిఁకైన విడువందగు నీవును నీకుమారియున్. 146

ఆ. వె. కనులఁ దెఱచినాఁడు గాధేయసంయమి
టక్కులాడి! నీకుఁ జిక్క డింక
నరుగు మరుగు మంచు నామడ యడుగుఁగా
నడిచె నుత్తరాద్రికడ కతండు. 147

చ. కనులను దాఁటి పోవుదనుకం గడునివ్వెఱపాటుతోడ న
మ్మునిఁ గని యంగనామణి విమోహలత౯ మొదలంటఁ గోసి మే
దిని నిడియున్న బాలికను దీయక యాదెసఁ జూడఁబోక చి
వ్వున దివి కేగెఁ దా నుడుకుఁబోతుతనమ్మున నంగలార్చుచున్.

ఆ. వె. తగవులాడి తల్లిదండ్రులు విడనాడి
పోయినట్టిచిట్టిముద్దుపట్టి
నరసి కణ్వమౌని యక్కటిక మ్మూని
కొనియె పర్ణశాల కొనరులీల. 149

ఉ. సంతసమార నామె కిడె సంయమిపాళి శకుంతలాభిధ౯
మంతు వహించు నొక్కమహిమండలదారు నుదారు వీను దు

ష్యంతు వరించి యొక్క సుతు నామె క నెఁ భరతుఁ; దదుద్ధతిఁ
అంతటినుండి యీధరణి కబ్బెను భారతనామధేయమున్. 150

తోటకవృత్తము. సవనావళియాజనసారమతీ !
నవనీతసమానమనఃకమలా !
కవిమానసకంజవికాసలస
ద్రవిమండల ! కృష్ణబుధప్రవరా ! 151

గ ద్య ము.

ఇది శ్రీహరిహరదేవదయాపాంగప్రసారణసమాసాదితోభయభాషాకవితా
రచనాప్రవీణ, కాకరపర్త్యుపనామకకాశ్యపసగోత్రపవిత్ర, బాప
నార్యభిషక్సార్వభౌమపౌత్ర, వేంకమాంబావేంకటరాయ
సుధీపుణ్యదంపతితనూజ, కవికంఠీరవ, కవిమూర్ధన్య
మహాబిరుదవిరాజమాన, కృష్ణశాస్త్రిప్రణీతం బైన
కౌశికాభ్యుదయమహాప్రబంధంబునందుఁ
దు రీ యా శ్వా స ము.



హరిహరదేవాయ నమః

# కౌశికాభ్యుదయము

## పంచమాశ్వాసము

కం. శ్రీదంతినగరవసదాం
గ్లాధిపతిప్రతినిధిస్స్వయంరచితవిశే
షాదర! శ్రీపదకృష్ణమ
హోదారాశయ! మహామహోపాధ్యాయా! 1

కం. అవధారు శతానందుం
డవలికథం జెప్పె నిట్టు లాకౌసల్యో
ద్భవునకు రాఘవునకుఁ గ
మ్రవచోరచనావిశేషరమ రమణింపన్. 2

మ. సరసీజాసనుఁ డొక్కనాఁడు విబుధేచ్ఛాపాలనాలాలసాం
తరచిత్తుం డయి, యుత్తరాచలముచెంతన్ ఘోరదీవ్యత్తపః
పరిపాకంబున బక్కటిల్లు నలవిశ్వామిత్రునిం డాసి యా
దరమారంగ మహర్షి వైతి వీఁక వత్సా! మానుమీ పూనికన్. 3

చ. అనవుడు గాధిరాజసుతుఁ డల్లనఁ గన్గవ విచ్చి చూచి యా
తనిపదపంకజాతముల దైన్యము తెట్టువఁ గట్టఁ గాంచుచున్
వినయము లంటసిల్లి కడు వెల్లిగొనన్ దమి దోయిలించి యు
స్సని తల వంచెఁ దృష్టి నిసుమంతయుఁ గాంచక వెచ్చనూర్చుచున్.

ఉ. ఇంబు తొలంగ ధాత దివి కేగె హతాశత; హానియున్ నిరా
లంబత నూర్ధ్వబాహుయుగళప్రచురస్థితిమై తపించెఁ దా
సంబరవీధి వర్షసమయంబున ఘోరనిదాఘమం; దగా
ధాంబులయందునన్ శిశిరమందు నహర్నిశ మావసించుచున్. 5

సీ. వేలుపుగాణీలపెదవు లెండుటఁ బాయ
వాయెఁ బంచాలి సపస్వరములు
పల్లవావళి యిష్ట పడదాయె భంగింపఁ
గాంతాకుచాశ్లేషగౌరవంబు
గంగోదకమున మున్కలు వెట్టుటే కాని
రాదాయెఁ దటికి నైరావతంబు
తడి నారనీకున్నఁ దల లెత్తవాయె నం
దనవనాంతరనవ్యసవ్యలతలు

తే. గీ. కౌశికాఖండతమతపోగాఢవహ్ని
సంజ్వరం బూర్ధ్వగామి యై సంక్రమింప;
వేయికన్నులఁ బలుమాఱు విచ్చి కాంచె
స్వర్గముర్గతి నాశచీప్రాణవిభుఁడు. 6

ఉ. కాంచుచు దీమసంబును గకాపిక లై తఱలంగఁబోఁ దలం
రించుచుఁ జిక్కఁబట్టుచు ధరించి యొకానొకదీమసంబుచే
మించునుపద్రవంబును దమింపఁ బదింబది మానసించుచుం
బ్రాంచితవైజయంతభవనాయతజాలసకాశవాసి యై. 7

ఆ. వె. ఆదితేయనేత యమితసమాధాన
మగ్నుఁ డై రహింప, హానివర్య
ధైర్యదళనచతురతానితాంతారంభ
రంభ యూరువిజితరంభ దోఁచె. 8

ఉ. తోఁచినతోడనే యతఁడు తొందఱపాటుఁ దొఱంగి యెంతయో
యోచన చేసి నిశ్చితము నూని సురాంగన నొక్తుఁ బిల్చి "రం
భాచపలాక్షి నిచ్చటికి నైశమ తోడ్కొని రమ్ము పో" మ్మనన్
వే చని చేరె నామె పురవీథుల దాఁటుచు వేశవాటికన్. 9

ఉ. ఏమియు పచ్చిగాఁ బరిచయించి లిఖించి నిజాశయంబులం
గోమలి యొక్తు చేత నలకూబరుఁ డంపినకమ్మ యిచ్చె రం
భామధురాధరాధర సుమాళముగాఁ బఠియించుచుండ సు
త్రామునిదూతి చేరఁ జని రాజనియోగము విన్నవింపఁగన్. 10

మ. "కనకానూనమనోజ్ఞగాత్రి ! యట కీకాదారిమాదారిప్రా
ద్దున నేతెంచెదఁ దప్పకుండ" ననుపంక్తుల్ తేపకున్ రంభ లో
మననంబుం బచరించుకొంచు సుఖముం బ్రాశించుచో వజ్రిమే
ల్పనుపుల్ వాసకసజ్జికాశయములన్ భంగించె నత్యంతమున్. 11

చ. అలబలవైరి తన్నసమయంబునఁ బిల్వఁగ సంపుహేతువుల్
తెలియక; తామసించి తరితీ పొనరింపఁ బ్రమాద మంచు లో
నులుకుచు, రాజదర్శనయథోచితవేషము నూని వేల్పుటో
కలికి గమించెఁ దా వలనుకన్నదరన్ మది జల్లుజల్లనన్. 12

తే. గీ. రంభ మరియాదఁ బాటించి రాచనగరి
కంతదవ్వున నే చతురంతయాన
మవతరించి హజారము నంటసిల్లి
క్రమతఁ గక్ష్యాంతరంబులఁ గడచి నడిచి. 13

చ. తనుఁ గని విస్మితిం గొనుచుఁ దత్తర మందుచు నోసరిల్లునం
గనల బహూకరించుచు జగాజిగిచూపులఁ బూపనవ్వులం
జనె సురవారముఖ్య పరిచారిక వెంబడి యోచనార్ఘురిన్
మునుఁగుచుఁ దేలుచున్న సురభూవిభుమ్రోలకు దోయిలించుచున్.

కం. ఉచితాధికాదరంబున్
రచియించి వచించె నిటులు రంభారమణీ
నిచితసహస్రేక్షణుఁ డై
శచీపతి స్వకీయయత్నసాఫల్యమతిన్. 15

చ. వలపులదీవి వై వెలయుభామిని నీవును వజ్రముం గడుం
గలుగుటచేతనే త్రిభువనంబులు హాయిగ నేలుచుంటి నో
జలరుహగంధి! వ్యర్థ మగు సంయమివర్యులపట్ల వజ్ర; మా
వెలితియుఁ దీఱుఁ దావకనవీనమనోహరచాతురీధురన్. 16

ఉ. పావకకీలలున్ వరుణపాశము నంతకుచండదండముం
బావనశక్తియున్ గిరివిపాటనదక్షమదీయవజ్రముం
జేవ నెసంగియున్ మివులఁ జేయఁగ లేని మహత్తరార్థముం
దావకచంచలేక్షణకనత్కిరణం బొకఁడే గడించెడున్. 17

ఉ. చక్కఁదనంబునందు నెఱజాణతనంబున గానసత్కళన్
మిక్కిలి పేరు లేని మన మేనక నే దరిసించి దాసుఁ డై
కక్కఱితిం గడుం గుడుచు కౌశికునీమము చెంగఁగొట్టఁగా
లెక్కయె నీకు వైళమ నిలింపులకుం బ్రియ మాచరింపుమా! 18

చ. అనుచుఁ బురందరుం డిటు నిజాశయపూరణసుప్రవీణుఁ డై
వినిచినకార్యభార, మరవిందదళేక్షణ యాలకించి కో
పనమునిమూర్తి నొక్కపరి భావన సేసి "హా తాస్మి" యంచుఁ దాఁ
గనుఁగవ రెండుచేతులను గప్పుకొనెం బరికంపితాంగి యై. 19

చ. నిలువ నశక్త యై తుదకు నీరదవాహనుపాదసన్నిధిన్
నిలువునఁ గూలి మూర్ఛను గనెన్ ఘననీలవినీలచారుకుం
తల; తల నూఁచి నవ్వుకొనె దానియవస్థను స్వార్థలోలుఁ డౌ
బలదమనుండు కన్గొనలఁ బల్మరుఁ జూచుచు మౌన మూనుచున్.

ఉ. కొండొకసేపు నిర్జరచకోరవిలోచన గాఢమూర్ఛలో
నుండి, యొకింత మేలు కని యున్నని వెచ్చగ నూర్చి లేచి యా
ఖండలుమ్రోల మోఁకఱిలి కాతరతాచలితాయతాక్షి యై
యెండ గళంబు నాలుకయు నేమియు వాకొన లేకయుండఁగన్. 21

తే. గీ. కనికరము వేయికన్నులఁ దొనుకులాడఁ
బలుకుపలుకునఁ గ్రొందేనె లొలుకుచుండ
హరిహయుం డావిలాసిని ననునయించి
మించుభయ మెడలించి వాంచించె నిట్లు. 22

ఉ. ఇంతభయంబునం బొగుల నేటికి మాటికిఁ గౌశికుండు దాఁ
గాంతలకౌఁగిలింతలసుఖంబు నెఱుంగనివాఁడు గాఁడు నీ
వంతకు మూల మేమి? తలవంపు ఘటిల్లెను వేశ్యాజాతికిన్
వింతగ నేఁటి కింతయువివేకనివా? వికచాంబుజాననా! 23

చ. ఒకపరి నీవు తళ్కు మని యోరఁగఁ జూచినయంతమాత్ర నీ
ప్రకృతి యచంచలస్థితి విరాజిలుఁ; గామముఁ గ్రోధ మూనుహా
నికి జడియం బ నేమి? యిది నీకొలమందలివారు విన్నచో
వికవిక నవ్వరే? యిటులు బేలతనంబునఁ గ్రాల నేలనే? 24

చ. నెలఁతరో! సూనసాయకుఁడు నీకనుసన్నలనే మెలంగు; రా
చిలుకలు గండుకోయిలలుఁ జెంత వసించు; వసంతుఁ డావనిం
గలయఁగ నావహించు మునుగాఁ జని; పున్నమచందమామ వె
న్నెలఁ గురియించు; బాసటగ నేనును నీసరసం జరించెదన్. 25

తే. గీ. మెలఁతరో! చక్కఁగా శ్రుతుల్ మేళవించి
యింపెసంగ విపంచి వాయించునెడల
గండశైలంబులే చాల కరఁగి పాఱు
మానవుం డగుగాధికుమారుఁ డెంత? 26

చ. ఉవిదరో! యొక్కపూపనగవో యొకవాలుపిసాళిచూపొ శే
రవళి వెలార్చునూపురవిరాజితచారుపదక్రమమ్మొ తా
వివశునిగా నొనర్చి వెనువెంటఁ బయంటచెఱంగు వట్టి నిఁ
జవిఁగొనఁ బ్రాఁకులాడునటు సల్పును గాధికుమారశేఖరున్. 27

ఉ. మానససీమ మానుననువానము మానుము కామినీమణీ!
పూనుము పూనికం దమి నపూర్వవిలాసము లావరింప నె
మ్మేను నలంకరించుకొనుమీ కొనుమీ సురగాయనీజనా
మానమనోహరాధరసముచ్చరితస్తవభాగధేయముల్. 28

కం. అని హెచ్చరింప హరి యుం
గన, నామెయు మాఱు వల్కఁగా నోడి కడుం
బనివినియెద దేవ! హసా
దని వినతి రచించి చేరె నావాసమ్మున్. 29

చ. నిరుపమలీలఁ గౌశికమునిప్రవరుండు తపించునవ్వనిం
దఱిసె వసంత మంతట నతాంతలతాంతనితాంతకాంత మై
సరసరసాలపల్లవకషాయరసైకనిషేవణక్రియా
పరిణతపంచమస్వరవిభాస్వరపైకవిజృంభణాంక మై. 30

సీ. వనజరజోహారివారిఁ గరేణుపైఁ
బుంవారణేంద్రమ్ము పుక్కిలించెఁ
గొదమతుమ్మెద చానఁ గూడి పూగిన్నెలో
నచ్చంపుఁ గ్రొందేనె లారగించె
మెసవఁగా మిగిలినబిసము నోటం బెట్టి
జక్కవ తనయాలి సత్కరించె
దాడిమ్మగింజ లెంతయు నొల్చి రాచిల్క
ముద్దారఁ జెలినోటఁ బోషణించె

తే. గీ. లాహిరీ గ్రమ్మ హారిణ మిల్లాలి మేను
కొమ్మకొన గోకి మాటికి గుస్తరించె
సుసుచిరోన్నతతరుల వల్లరులు పెనఁగె
సారశృంగారశీల వాసంతవేళ. 31

ఉ. తుమ్మెదనారితో నలుసుఁదూపులతో నెఱితుంటవింటితోఁ
గమ్మనియల్లితెమ్మెర లెగాదిగ బాగుగ నేసరేఁగ, నం
దమ్ముగ మాధవుండు కయిదండ నిడన్ మసఁ దుండె రేయి నం
దిమ్ముగ మేనమామ గురియింపఁగ వెన్నెలజల్లు లెల్లెడన్. 32

చ. అలుకజిరావజీరుని బలారిని సారసయోనిఁ దాల్చురా
చిలుకను మబ్బు నంచను విశేషముగా నొగి నంటసిల్లు మే
లొప్పెలుపులఁ జల్లఁగాఁ బుసికిపుచ్చుకొనన్ వగలాడి రంభ ప
ల్కులల నెరులన్ బెడంగునడఁ గూరిచి కౌశికు మస్తరింపఁగన్. 33

సీ. కొమరారు నెక్కుళ్ల గోజంగిరంగుతో
రవలముద్దులడాలు రాయిడింప
ఱైక పీలఁగఁ బొంగురారాపుచన్నుల
బన్నసరంబులు తన్ని యూఁగ
మాటికి మీఁగాళ్ళ మాందాలికుచ్చెళ్లు
వింతవింతగఁ గుప్పిగంతుకొనఁగ
వెన్నానుకొని లీల వ్రేలాడువాల్జడ
పిక్కలతోడ డీడిక్కులాడఁ

తే. గీ. బదపదంబునఁ గాంచీవిభాసమాన
కింకిణీగణ మురియాడి గిలుకు మనఁగఁ
బయ్యెదం జక్కపఱుచుచు వచ్చెఁ బ్రౌఢ
భామినులఁ గూడి తత్తపోవనికి రంభ. 34

మ. సరళానోకహమూలమందు నొకపాషాణంబుపై ద్వీపిము
ష్కరచర్మంబున మేను వంప కుభయాంసమ్ముల్ గడు న్వంచి భీ
కరదృష్టి న్నిజనాసికాగ్రమునఁ జక్క న్నిల్పి పాణిద్వయిం
గర ముత్తాన మొనర్చి ఘోరతపముఁ గావించునక్కౌశికున్. 35

ఉ. కొంకు తురంగలింప నలకూబరుసాని కనుంగొనంగ లో
నంకిలి యంకురించియు సుమాంబకభీషణనిస్వనద్ధను
ష్టంకృతులుం బురందరవిశంకటశాసనముం దలంపఁగా
నింకెఁ దనంతఁ దాన జనియించెఁ బురాధికసారధీరతల్. 36

ఉ. కోయిల యొంపు గెంజిగురుకొమ్మలమాటున నక్కి నిక్కుచుం
"గో" యని హాయిగా మిగులఁ గూయఁగ రంభయు నాళిపాళితోఁ
గూయఁదొడంగెఁ దప్పికసుకూజితముం బుడుడించునట్లుగా
"హా" యని విచ్చెఁ గన్నుఁగవ నాయమి యాయమి తారవార్భటిన్.

కం. ఓరఁ గనుంగొనె మునిమణి
నారంభారమణి గడు నొయారం బారన్
మారుఁడు చూపులఁ దూపుల
సారెకు సారించి విసరసాగెన్ లోఁగన్. 38

చ. ఎడమబుజమ్ము గొంత స్పృశియించి యురోజము నంటి వ్రేల వా
ల్జడ సవరించి దక్షిణకుచమ్ము పయంటను వీడి సుంత ని
క్కుడుఁ గనఁ దక్కరమ్ము నొకకొమ్మపయిం గదియించి నిల్చెఁ బు
త్తడినెఱిబొమ్మ నా నమరతామరసానన మానిఁ గాంచుచున్. 39

మ. అఱచేతన్ నునుఁజెక్కులిన్ నిలిపి స్మేరాంకూరముల్ సారెకుం
జెరలాడన్ శిర మంసమం దొరఁగ నిక్షేపించి పెంపారుపై
సరమందు స్రమ మందుచందములు మించం గన్నులన్మోడ్చి యు
న్నురవ న్వేలుపుసాని దాని మునియుం జూచెన్ యదృచ్ఛాగతిన్.

కం. హేవాక మొసఁగ రంభా
జీవంజీవాక్షి వీణెఁ జేకొని ప్రణయం
బావేశింపఁగ మీటుచు
జావళులం బాడె రాజసంయమి వినఁగన్. 41

చ. కిలకిల నవ్వుచుం జెలుల గేలి నొనర్చుచు మేలిపయ్యెదం
బలుమరు చక్కదిద్దెడు నెపమ్మునఁ జన్గవసౌరుఁ జూపుచున్
మలఁగి మలంగి చూచుచు సుమాళము నందుచు నావులించుచున్
మెలఁగె నిలింపవారతరుణీమణి యమ్మునిరాజసన్నిధిన్. 42

సీ. చేరఁ గొల్వ నొకింత మీఱుకన్నులు గాని
బొమ్మంచుతీయనిమోవి గాని
పుడమిపై జీరాడు జడబెడంగులు గాని
సోము సోమించు నెమ్మోము గాని
యంచల నొంచు నొయ్యారంపునడ గాని
తవిసులఁ జిదుముపాదములు గాని
పొంగారు కుడుకురాపుంజన్నుఁగవ గాని
పిడికిట నడఁగెడునడుము గాని

తే. గీ. తళుకు లీనెడు చెక్కుటద్దములు గాని
నవతుఁ గానసమందహాసములు గాని
సొబఁగులం బుక్కిలించు పెన్పిఱుఁదు గాని
కెరలి జడదారిమదిని రాకింపవయ్యె. 43

చ. కనలక సంచలింపక వికాసముఁ జూపక పక్ష్మలింప క
మ్మునివరుఁ డుంటచే దిటముఁ బూనుచు మాయలమారి నెచ్చెలుల్
తన కిరువంకలన్ బలియుఁ దాపసి డాసి యొయారమారఁగా
వినతి నొనర్చె రంభ పృథివీతల మానఁగ వంగి నవ్వుచున్. 44

తే. గీ. వెలవెలఁది వంగి ప్రణమిల్లువేళ శ్రవణ
కలితసుందరకుందకుట్మలము జాఱెఁ
బైఁటతోఁ బాటుగా మునిపాదయుగళి
నత్తఱిం జూపె నొకవింత నమరకాంత. 45

చ. చెడిప నెడంగుచేతఁ గసి చిత్తమునం గడు నేవగించి పెన్
జిడిముడిపాటు పాటిల నసీ యని మోముఁ ద్రిప్పి కన్బొమల్
ముడివడ జేవుఱింపఁ దెలిమో మధరమ్ము చలింప నాగ్రహం
బడరఁ గ్రమక్రమంబుగ గొహాః రొనరింపఁగ నుద్గమింపఁగన్. 46

శా. “స్వారాజాధముఁ డంప నాతపములన్ భంగింపఁగా వచ్చె రం
భారంభోరువు బుద్ధి లే” దనుచు విశ్వామిత్రుఁ డూహించి వి
స్ఫారాక్షిద్వయి నిప్పుకల్ గురియ హస్తం బెత్తి శాపించె “నో
సీ! రాకాసి! వసింపు శైలి వయి యిస్సీ!” యంచు నాఱోచెలిన్.

కం. ఇవ్విధి ముని శపమునకుం
దవ్వై యలుకన్ వెలార్ప దారుణశాపం
బవ్వారభీరులోచన
కెవ్వన బిట్టార్చి మౌని కెలఁకున వ్రాలెన్. 48

చ. కలఁగి సఖీజనావళి పికాపిక లై పఱచెన్ వడిన్ భయా
కులత పరాక్రమింపఁ దమకోమలి సోలి పడంగఁ జూచి; పూం
విలుతుఁడు నామనిన్ సెలవు వేఁడక యే నునువెచ్చయూర్పుతో
వెలవెలఁబాటుతో వెలఁడె వింట నెసంగెను నెక్కుడించుమన్. 49

వ. అంత.

చ. “ఒకనెలయాలి మోహలత నూఁగియు మున్నది యూచముట్టఁగాఁ
బెకలిచినాఁడ నేఁడు నొకవేశ్య లభించెను దీని కేను లోఁ
గక నిలువంగ నేర్చితిని కామము నొంచితిఁ గాని క్రోధ మే
లిక యయి నన్ జయించె నవలీల మునుల్ నను జక్కలింపఁగన్.

కం. ఏతటి నరిషడ్వర్గని
పాతన మొనరించు నతఁడె పడయు నసంప్ర
జ్ఞాతసమాధిస్థితిఁ గర
మాతఁడె బ్రహ్మైక్యభావ మందుం దుదకున్. 51

తే. గీ. ఇంత కోపించి కొల్లవోయితిఁ దపంబు
నెల్ల నీలీల; నా తెల్వి తెల్లవాఱె
నక్కటా!" యంచు లోలోన నలమటించు
కౌశికుఁడు గాంచి యపుడె మేల్కనిన చెలిని. 52

శా. కైలాటంబున నన్ను లోఁగొనఁగ సంకల్పించినా వీవు శా
పాలాపంబుల పాలె యైతివి మదీయాపారకోపంబునం
దూలెన్ మత్సముపార్జితామితతపోఽస్తోకప్రభావంబు లో
బాలా! నీకును నాకు నొకవిభుఁడే పైచేయి యీచేఁతలోన్. 53

ఆ. వె. ఇంద్రుపనుపు సేయ వేసి యాతనిచేతఁ
జేసి తేని యితనిచేత నబల!
పొసఁగు నీకుఁ గీడు ముందున కేగఁగా
నూయి వెనుక కేగ గోయి నాఁగ. 54

మ. అని వాకొంటయు దోయిలించి సురరూపాజీవ యామహానిచం
ద్రుని పాదమ్ములచెంత నెంతయును సాందోళించుచున్ మోఁకటి
ల్లిన నాతం డనుకంప మెండుకొనఁగా "లే లెమ్ము రంభా! తపో
ధని భూదేవుఁ డఖండతేజుఁ డొకఁ డుత్పాటించు నీశాపమున్." 55

తే. గీ. అనుచు శాపావసానమ్ము నానతీయు
నంత గాణిక్యమాణిక్య మతనిఁ బాసి
యలసగమనమ్ముతో నేఁగు నవసరమునఁ
బెనఁగె గాధేయుశాపమ్ము విక్రమించి. 56

లయగ్రాహి. కాలఫణిరాజమున వాలుఁజడ, మేలిమగ
రాలఁ బలుచాలును, బ్రవాళమున మోవిన్
నాలినడలన్ మదమరాళముల, మంజులక
పోలముల నద్దముల, లోలనయనంబుల్
బాలహరిణంబుల, గయాళిచనుదోయిఁ గన
కాలుకలలోన, నలకాళి నళులందున్
గేలు బిసమందు, నుడుపాలకునియందు మొగ,
మోలి నిడి రంభ వడి శైలిగ నెలింగెన్. 57

మ. ఇఁక నాతంకము లెన్ని వచ్చినను రానీ నేఁ జలింపం దపో
ధికపారీణుఁడ నౌచు బ్రహ్మతను సాధింతుం గరం బంచుఁ గౌ
శికుఁ డూనెం బటుదీక్ష; రాఘవ! తపస్సిద్ధిప్రకారమ్ము నాఁ
పి కథింతున్ వినుమీ యనంతరమహావృత్తాంతమున్ ముందుగన్.

శా. నాకాధీశ్వరుఁ డొక్కనాఁడు సభలోనన్ మౌనులం జూచి "భూ
లోకంబందున సూనృతవ్రతుని నాలోచించి పల్కుం" డనన్
సాకేతేశుఁ ద్రిశంకునందను హరిశ్చంద్రుం బ్రశంసించి స
త్యాకారుం డనుచున్ వసిష్ఠముని వ్యాహారించె నుద్బాహుఁడై.

మ. తనచేఁ దొల్లి నవీననాకభువి నధ్యక్షించుభూపాలుసూ
నునిసత్కీర్తిఁ దిరమ్ముగా జగములన్ నూల్కొల్ప నూహించి చ
య్యన గాధేయుఁడు లేచి వాకొనెఁ బరీహాసమ్ము వాసింపఁ గో
పనవిస్ఫూర్తి నటించుచున్ విద్రుచుచున్ వాసిష్ఠవాచావళిన్. 60

చ. బళి బళి మేలు లెస్స నృపుపంగడమందున వింగడంబుగాఁ
గలుగఁగఁబోలు నిప్పటి కొకానొకసూనృతపాలనవ్రతుం
డిల నిటు పుండలింపనగునే సభలోపలఁ దత్పురోధనై
వెలయుటఁ బక్షపాతము లభించుట సాజమ నీకు ధీనిధీ! 61

మ. అనుఁ డెంతేని దృఢీకరించె నిజవాక్యమ్ముల్ వసిష్ఠర్షి యు
చ్చనినాదమ్మునఁ గౌశికుం డలహరిశ్చంద్రు న్నిమేషంబులో
ననె భంగింతు ననెం బ్రతిజ్ఞ ననుసంధానమ్ముఁ గావించుచుం
జనె సాకేతపురీవరమ్మునకు నైజవ్యాపృతిం దీర్పఁగన్. 62

మ. సవనార్థ మ్మమితార్థ మి మ్మనుచు నాసాకేతసర్వంసహా
ధవు నర్థించి పరిగ్రహించి నృపునొద్దన్ సర్వమున్ దాచి స
స్యవిరోధీడితవన్యజంతుహరణవ్యాపారధౌరేయు న
య్యవనీశాను వరింపఁ బంపె నిజమాయాజాతమాతంగులన్. 63

ఉ. పంచిన నాయినాన్వయనృపాలుని మ్రోల సులీల గ్రాల నా
పంచమచంచలాక్షు లనవద్యగతిన్ నటియించుచుం దదీ
యాంచితసత్కృపారసము నాని యభీష్టముఁ గోరుకొం డనన్
వంచన మించఁ దత్సురతవాంఛలఁ దెల్పి రనల్పజల్పలై. 64

మ. మలయంగా నలుకల్ నృపాలకుఁడు తన్మాతంగమాతంగయా
నలఁ దర్జింపఁ దటాలఁ గౌశికుఁ డసన్న్యక్కారధిక్కారముల్
బలకాయింపఁగ నేగుఁదెంచి లయవేళాకాలుఁడో నా నిలా
తలపాలావళిమౌళిమౌళి భువిఁ జిందం దన్ని డాకాలునన్. 65

మ. "అవమానింతువె నాకుమారికలఁ బేరల్కం దలారించి భూ
ధవలోకాధమ!" యంచుఁ దిట్టి యపరాధన్యాసశిక్షార్థ మ
య్యవనీదారుని సర్వరాజ్యరమఁ దా నంకించి యాత్మీయరా
జ్యవిదూరుం డయి పొమ్ము పొ మ్మన హరిశ్చంద్రుండు పోఁబోవఁగన్.

మ. మును నే నీకడ దాచఁబెట్టినధనమ్మున్ నాకు నీకుండఁగాఁ
జనె దేలా?" యని యడ్డమై నిలువ విశ్వామిత్రుఁ; డారాజు లో
వనటం జెందుచు "రాజ్య మంతయును మీపాల్జేసితిన్ వేఱుగా
ధన మెం దున్న" దనంగ మౌని పదముల్ ధట్టించి తా నిట్లనున్. 67

శా. దాచంబెట్టిన యాధన మ్మొకటియుం దక్కఁ జ సమస్తమ్ము నే
మీచేతం గడు ధారవోసి తని భూమీనాథ! వాకొంటివే!
వాచాటత్వము లేల సాధనము సంపాదించి నా కిమ్ము లే
దా చాతుర్యము మీఱ న్యాసమె యసత్య మ్మంచు వాచింపుమా.

చ. అనుడు నసత్యభీతమతి యాధరణీపతి మానసుండె యు
మ్మునిఋణ మెల్లఁ దీర్తు నని పోయెను జంద్రమతిం సతీమణిం
దనయుని లోహితున్ ఋణధనగ్రహణార్థమునీశయోజితున్
మునిసుతు నొక్కనిం గలిసి పొక్కుచుఁ గాననమార్గచారి యై. 69

సీ. నలుమూలలం గ్రమ్మి నాలుకలం జాఁపి
వెచ్చగా వచ్చు కార్చిచ్చు నార్చి
యెడనెడ ఋణధనం బి మ్మంచుఁ బీడించు
నక్షత్రకుని కమంచగతి లోఁగి
గాఢనిద్రావేళఁ గబళింప వచ్చిన
బేతాళు నుద్ధతిం బిలుకుమార్చి
యెంతయోబాధ లో నిముడించుకొనుసతీ
సుతులఁ గన్గొని సాటసాటల మించి

తే. గీ. చెదరుదీమసముం జాల కుదురుపఱచి
నిశితదుఃఖమ్ము లోలోన నిహ్నవించి
వారణాసి నఘాగమవారణాసిఁ
జేరుకొనియె హరిశ్చంద్రధీరమూర్తి. 70

చ. పొరి పొరి రాయిడింప మునిపుత్రుఁడు పైకమొసంగు మంచుఁ, జా
కురుపడి ధర్మపత్నిఁ గొడుకుం దెగ నమ్మిన నప్పు తీఱమిం
ద్వర నొకకాటికాపరికిఁ దా నన్యూణత్వముఁ గాంచ నమ్ముఁ డై
శరము చరించె నాధరణికాంతుఁడు కాశి శ్మశానవాటికన్. 71

ఆ. వె. చంద్రమతిఁ గుమారసహితమ్ముగఁ గ్రయించు
కాలకౌశికుండు కలహకంఠి
యనెడు సార్థకాహ్వయాత్మీయజాయకు
వారి నప్పగించెఁ బనులఁ గొనఁగ. 72

సీ. చీఁపుఱుంగట్టను జేఁబూని యూరంత
పెరఁటి నద్దంబుమాదిరిగ నూడ్చుఁ
గరసీమ నవరుకేఖాపాళి యఱుగంగ
వంటగిన్నెలఁ దోమి వరుస నుంచు
వొడ్లలోఁ జెట్లపాదుల నింపి పాఱఁగఁ
జెమట కాఱఁగ నీరు చేది పోయుఁ
గంది క్రొన్నెత్తురుల్ చింద్రఁగాఁ గెంగేల
మెండుగా బియ్యంపుపిండి విసరుఁ

తే. గీ. జాటుగా నేడ్చుటకుఁ దీరుబాటు లేక
యూల్మగలు తిట్టి కొట్టఁగా నలమటించు
నొక్కకొమరుని నోరార నూఱడింప
నోచ కాచంద్రమతి మోము వాచి యుండె. 73

ఉ. ఆకులఁ గాలకౌశికునియానతిఁ గోయఁగ నేగి లోహితుం
డేకడనో సమీపవని నీలిగెఁ గాలభుజంగదష్టుఁ డై;
వాకొనఁగాఁ గుమారుమృతివార్త నొకండు సతీమతల్లికిన్
లోకము చీకురింపఁ గలలోఁనఁబలెఁ వినియెఁ సమస్తమున్. 74

చ. తనపయిఁ గమ్మిరించినవితాకు క్రమంబున జాఱ నామెయుం
దనయునుదంత మంతయును దారసిలన్ మది నొక్కమాఱ చే
తన యయి చాపచుట్టఁగ "సుతా!" యని యాఱచి నేలఁ గూలెఁ జెం
త నలరుమ్రాఁకు దాఁకఁ దల; ధారగఁ గాఱ నజస్రమస్రముల్.

ఆ. వె. తేటి శోకరసము తెరతెరగా రాఁగ
గుండె బాదుకొనుచు గోలుగోలు
మనుచు నేడ్చునంత నచ్చటి కేతెంచి
కలువకంటిఁ గాంచి కలహకంఠి. 76

కం. "సింగి వగులంగ నిట్టు ల
మంగళగతి నేడ్వఁబోకు మాగృహమం దో
వెంగలివిత్తా !" యనఁగాఁ
బొంగి పొరలి వచ్చుదుఃఖమునఁ గంపిత యై. 77

మ. చిరకాలమ్మనుండి నాయెడఁదలోఁ జిట్టాడుతాపమ్ము బి
గ్గరగా నేడ్చినఁగాని నన్ను విడువంగాఁ బోదు తల్లీ! మదిం
గరుణం బూనుము సూతికిన్ దహనసంస్కారమ్ముఁ గావించి చె
చ్చెఱ నేతెంచెద నంచుఁ జంద్రమతి వాచింపం గ్రుధాభోగ యై.

ఉ. మోడి నెసంగి నామొగముముందఱనే యిటు ప్రేలినావె? నీ
పాడుమొగానఁ గొట్టితి మపారధనమ్మును నీమగోల నూ
ర్వాడలు ప్రోఁగె నీమగఁ డెవం డిపు డూడుచు సంజగుమ్మ మీ
వేడుకవచ్చుఁ దీరికగ నేగి నిశీథిని గుట్టచెంగటన్. 79

ఆ. వె. అంతఁ గలహకంఠి యాడిపోయఁగ శోక
మెల్ల మ్రింగికొనుచు నల్ల లేచి
తొంటికంటె మించు నింటిపనుల నెల్లఁ
దీర్చి విధిని లోనఁ దిట్టుకొనుచు. 80

మ. కను మూయం బెఱువర్ణ సమమ్మ యగు నాకాదారిమాదారిప్రా
ద్దున నేకాకిని యాచుఁ జంద్రమతి యాందోళించుచుం దూలుచుం
జని కాంచెన్ వనికాంతరావని ననిశ్వాసమ్ము వాసింప మ్రాఁ
గనులం బెట్టినలోహితుం బరిచలత్తద్యోతదీపాద్యుతిన్. 81

ఆ. వె. గుండె బాదుకొనుచు గొబ్బునఁ గొడుకుపై
వ్రాలి కొసరి కొసరి వానిచెయ్వు
లెల్లఁ దలఁచి తలఁచి యేడిచి యేడిచి
కాలహరణభీతి గ్రాల నాఁతి. 82

చ. సుతుని బుజాన వైచుకొని సోలుచు మోయఁగ లేక మోయుచున్
గతవిభవంబులం దలఁచి కన్నుల నీ రొలుకంగ నాఁటిదు
ర్గతిఁ దలపోసి "పాప మిటు బ్రద్దలువాఱెనె నేఁటి" కంచుఁ దా
బితృవనసీమఁ జేరి యటఁ బెట్టెఁ గుమారుశవంబు నొక్కచోన్.

ఆ. వె. సగము సగము కాలి చల్లారుకొఱకచ్చు
గములఁ బ్రోవు వెట్టి కన్నకొడుకు
నందుఁ బెట్టి దహన మాచరింపఁగ శ్మశా
నమునఁ దిరిగె రోదనమ్ము కెరల. 84

మ. ధనముం జాలఁగ వెచ్చఁబెట్టి తను సంతం గొన్న యావీరబా
హుని దేశమ్మునఁ గాటిమాడఁ గొన నుద్యోగించి కాఁపుండి యో
చనతో నించుక కన్ను మోడ్చినహరిశ్చంద్రుండు మేల్కాంచి యొ
య్యన మంచెఁ విడి డాసి, పుత్రుఁ జితిపై నాసించుభామామణిన్.

మ. "అతివా! యిన్నడిరేయి మాడ నిడ కన్యాయమ్ముగా నీసుతుం
జితి నిర్మించి దహింపఁ జూచెదవె యిస్సీ!" యంచు గర్జింపఁగా
వెతలం దూలుచు "నోదయామయుఁడ! నన్బాధింపఁగాఁ బోకుమా
గతి యావంతయు లేనిదాన" నని పల్కుం గాంత రోదించుచున్. 86

చ. కనికర మూనఁగాఁ దగవు గా దని యాధరణీంద్రమౌళి నె
మ్మనమున నెంచి "యోయబల! మంగళసూత్రము నా కొసంగి నీ
తనయు దహించుకొ" మ్మన వితాకున నిల్చె లతాంగి తాలి యు
న్న్యన కెటు గానుపించె నని యోచనసేయుచు నారటించుచున్. 87

ఉ. ఇమ్ము బిరానఁ దాలి నిడ నిష్టము లేనియెడం దొలంగు శీ
ఘ్రమ్ముగ నీకళేబరముఁ గైకొని యంచు నదించు వానిరా
వమ్మును బోల్చి సంశయము వాసి తదీయపదాంతికమ్మునం
దమ్మక చెల్ల ! నాథ ! యిటు లైతివె” యంచు సుమాంగి సోలఁగన్.

మ. అనుమానంబు బలీయమై తుదకు జాయాత్వమ్ము సిద్ధింప న
య్యినవంశాగ్రణి లేవనెత్తి మగునన్ హృత్సీమ నాసించుచున్
విని కాంతామణిచే నిజాత్మజవిపద్వృత్తాంత మెంతేనియున్
ఘనదుఃఖంబునఁ బాలు పంచుకొని తత్కాలోచితాలోకియై. 89

తే. గీ. వేరికడ నైన మాడను వేఁడి తెమ్ము
పురమునకుఁ బొమ్మనంగ నప్పరమసాధ్వి
ప్రాణనాథుపవిత్రధర్మగతి కలరి
పతిని వందించి చనెఁ బురీపథముఁ బట్టి. 90

తే. గీ. తెలిసి కౌశికుఁ డాంతరదృష్టిఁ బుణ్య
దంపతులనీతిరీతి కెంతయును సంత
సించి యమితమ్ముగాఁ బరీక్షింప నెంచి
చోరులన్ సృజియించి పంచుటయు వారు. 91

చ. సరగునఁ గాశికాధరణిజాసితనూజుని జంపి వాని మైఁ
బరఁగుమణీవిభూషల నవారణలీల హరించి యారెకుల్
దఱుముచు రాఁగఁ జంద్రమతిదాపున వానిని డాగురించుచుం
గరము దిరోహితత్వమును గాంచుటయున్ భటు లామె చెంగటన్.

చ. కనుఁగొని భర్తృదారకునగల్ హరియించుటె కాక వానిఁ జం
పినయది యోగయోగినిజు పేదపడంతి యటంచుఁ బట్టి రా
జునెదుట నామె నుంప, శిరసుం దెగ నేయుఁగ నాన వెట్టి య
జ్జనపతి యామె నంపెను శ్మశానము నేలెడువానిచెంతకున్. 93

చ. రమణి తలంపఁగా నిరపరాధిని యంచు నెఱింగియున్ ధరా
రమణునిపంపు సేయఁగ బిఱాన ఖరాసిని దూసి వ్రేసెఁ గా
సుమసుకుమారికంధరము సూచి త్రిశంకుసుతుండు వ్రేయుఁడున్
సుమవరదామ మై నెగడె సుందరి కాయసిఘాత మెంతయున్. 94

తే. గీ. చకితుఁ డై రోషమున హరిశ్చంద్రధరణి
పాలకలలామ మెంతయుఁ బ్రబలిన సేసి
క్రమ్మఱ శిరోధి గుఱి చూచి కత్తి నెత్తి
చయ్యనన్ వ్రేయు నుంకించు నసమయమందు. 95

శా. వే వేంచేసి వసిష్ఠసంయమియు దేవీసంగతాంగుండు కా
శీవిశ్వేశుఁడుఁ, గౌశికుండును, సునాశీరుండు నాత్మాంగనా
గ్రీవారక్తనతత్పరుం డయినసాకేతావనీజాని నెం
తే వారించిరి "మాను మాను" మని కత్తిం గొన్న కేల్వట్టుచున్.

తే. గీ. తరణికులమణి రమణితో ధరణి సోఁక
మస్తకము వారి కెల్ల నమస్కరించెఁ
గ్రమత నర్హతఁ బాటించి; కౌశికుండు
తలకడచి యెల్లవారలఁ బలికె నిటులు. 97

చ. భవదతివేలసత్యపరిపాలనలీల నిలాతలంబునన్
మివులఁ బ్రచారము న్సలుప నేన రచించినవాఁడ నీయుప
ప్లవముల నెల్ల; నీయశముఁ బ్రాఁకెఁ ద్రిలోకిని వత్స! భావిస
త్కవివరు లెల్ల వ్రాయుదురు గాక తిరంబుగ నీచరిత్రమున్. 98

ఆ. వె. అన వసిష్ఠముని "తథా" స్తనియెఁ బులోమ
జామనోహరుండు "స్వస్తి" యనియె
మోదభరితు లగుచు "వో నమో ధన్యో స్వ"
యనిరి సతియుఁ బతియు నమితభక్తి. 99

చ. పొలఁతుల కెల్ల నీమెయిను బూరుషపాళికి నీవు పూర్గద
ర్శులు గుణసంపదన్ గురుయశోవిభవమ్మున నీజగాన విూ
రలు ననుఁ గోరుకొంగ డొకవర మ్మని పొలి వచింప వారలుం
బలికిరి కాశికేశసుతుప్రాణము లి మ్మని దోయిలించుచున్. 100

మ. స్మిత మాస్యంబునఁ గొరగింపఁగ సముజ్జీవింపఁగాఁ జేసి లో
హితుఁ గాశీనరపాలనందనుని విశ్వేశుండు పుత్తెంచె ద
క్షత సాకేతపురీవరంబునకు నాశాసించి; పాలించెఁ దాఁ
జతురంభోధిసమంతరక్షితి హరిశ్చంద్రుండు నిస్తంద్రుఁ డై. 101

కం. దశరథరామా! యిటు లా
త్రిశంకుసుతుకీర్తి నిలిపె స్థిరగతి జగతిన్
కుశికకుమారుం; డకథిత
సశేషకథ నిదె వచింతు శ్రవణింపు మయా! 102

కం. రంభను శపించి క్రోధా
రంభమునకు మిగుల వగచి రాజర్షి సము
త్తంభితదీక్షం దప మా
రంభించె నుదీచి విడిచి ప్రాచీసుతటిన్. 103

సీ. అవటుప్రదేశంబు నవతరించుజటాళి
నెంతయుఁ దైలపాయికలు ప్రేలఁ
గక్షద్వయిన్ సరఘాసమవాయముల్
మూఁగుచు మధుకోశముల రచింపఁ
బరివృద్ధపాదనాఖరకోటి రాపాడి
భుజగముల్ నిర్మోకములఁ ద్యజింప
దేహకండూతి మందీభవింపఁగ మత్త
భూదారవితతి పీపులను రాయ

తే. గీ. నెఱుఁగ కణుమాత్రమైన వహ్నిశిఖాళి
సారసప్తమభూమికాస్థాయి యగుచుఁ
గేవలుం డయి సర్వప్రకృతియు లేక
వఱలె జీవచ్ఛిలాసాలభంజికవలె. 104

మ. పురుషార్థాచరితాంతరాయనిచయంబుల్ కోపసందీపనా
కరపాండిత్యవిహీనతం గడు నడంగం గౌశికుం డిట్లు వ
త్సరముల్ వేయి దపించి యల్లన సమాధానమ్ము దారించి యో
గిర మానక్ గమకించు నంతఁ, గని యోగీర్వాణనాథుండు తాన్.

తే. గీ. వెన్నముక నంటుకడుపుతోఁ బీకెవాఱు
మోముతో, వంగునడుముతో, ముడుతలు వడి
కడు వడఁకుమేనితో, మూఁడుకాళ్ల ముసలి
బాడబునివేసము ధరించి వచ్చి యటకు. 106

తే. గీ. "అన్న మన్న" మఁటంచు హీనారవంబు
గునియ దబ్బాటు నిలువఁ గూలఁబడియెఁ
గని కనికరమ్ముతో గాధితనయుఁ డెల్ల
యోగిరమ్ము నొసంగి తా నుపవసించె. 107

మ. పునరాహారనిషేవణాశయము సంపూర్ణమ్ముగాఁ గుండలిం
చిన యోగాధిసుతావతంసము తపించెన్ దంతురోచ్ఛ్వాసబం
ధనమూర్ధోదితధూమసంహతినిరుద్ధస్ఫారలోకత్రయీ
జనతాలోచనమాలికాంతరకళాజాలావిలాసాఢ్యుఁడై. 108

కం. ప్రతిరోమకూపమున నా
తతగతి విస్ఫుల్లతావితానమ్ములకుం
బ్రతియై తపోఽగ్నికీలా
తతాయిజాలమ్ము లెగసెఁ దాపసి మేనన్. 109

శా. ఆకారంబులలో గుణావళులలో నాకూంతిలోఁ జేతలో
నేకీభావము లేక వైరములతో నేపారుదైతేయులున్
నాకుల్ ప్రోవడి యైకకంఠ్యముగఁ బ్రాణప్రీతి దైవాఱ హా
హాకారంబుల బాతళించిరి నిరస్తాశేషభేదోన్నతిన్. 110

శా. భూకంపంబు జనించె నెల్లెడల నంభోరాశు లైక్యంబుఁ దా
మాకాంక్షించి యభంగభంగములతో నాకాశ మంటెం గడున్
లోకాలోకము మ్రొగ్గె హోరుమనుచున్ ఘోషించె జంఝానిలం
బేక మ్మయ్యె నవగ్రహమ్ములును మౌనీశోత్తపస్తప్తమై. 111

మ. దనుజాదిత్యనితాంతసన్నుతులచేతన్ ధాత సంప్రీతుఁడై
విని సాకల్యముగా జగత్త్రియసమావిర్భూతబాధాకథన్
వెనువెంటం జనుదేర ఖేచరమునుల్ వృత్రారిముఖ్యామరుల్
ఘనతేజోవృతదుర్నిరీక్ష్యభయదాఖండాకృతిం గౌశికున్. 112

ఉ. చేరి ప్రమోద మారఁ గుడిచేతఁ దదీయకృశాంగకావళిన్
సారెకు దువ్వుచున్ మధురసప్రతిబోధివచోవిలాససం
భారముచేతఁ గౌశికుసమాధి సమాప్త మొనర్చి తన్నమ
స్కారము లంది సుందరహసన్ముఖసారసుఁ డౌచు నిట్లనున్. 113

మ. "అతిమాత్రంబు తపించి డస్సితి కుమారా! కౌశికా! సర్వస
మ్మత మై పొల్చె భవత్సమార్జితము బ్రాహ్మణ్యమ్ము లే లెమ్ము నీ
కతనన్ లోకము లేక్రియం గలఁగెనో కన్గొ" మ్మనన్ మోదముల్
మితిమీఱం గుశికాన్వవాయుఁ డిటు పల్కెన్ లీలఁ గేల్మోడ్పుతో.

శా. ఆరూఢస్థితి నే నెసంగునెడ బ్రాహ్మణ్యమ్మునన్ నన్ వష
ట్కారమ్ముల్ నిఖిలాగమమ్ములును నోంకారమ్ము దీర్ఘాయువుం
జేరంగా నగు; నావసిష్ఠముని యాశీర్వాదముం జేసి ని
ర్ధారింపం దగు భారతీరమణ! మద్బ్రాహ్మణ్య మత్యంతమున్. 115

కం. అనుఁడుఁ జతురాననుఁడు నె
మ్మనమున మోదించి మందమందహసితముల్
గునియఁగ శిరముం గదలిచి
ఘనుని వసిష్ఠమునిఁ బిలువఁగా బంచె హరిన్. 116

మ. సురలోకేశ్వరు వెంట వచ్చెడువసిష్ఠుం జూచి మోదాశ్రువుల్
దొరఁగన్ దిగ్గన లేచి వాని కెదురై తోడ్తెచ్చి యర్చించి యా
సరసం బ్రాంజలి యౌచు నిల్చు నలవిశ్వామిత్రు గాటంబుగాఁ
బరిరంభం బొనరించి మై నిమురుచుం బల్కెన్ వసిష్ఠుం డిటుల్.

శా. "పంతంబుం గొని యెట్టకేల కరిషడ్వర్గంబు నిర్జించి య
త్యంతంబున్ మనమున్ దమించి పటుయోగాలంబివై తద్భవా
నంతాపూర్వవిచిత్రశక్తులకు మోహం బందియున్ వీడి నీ
యంత న్నీవ గడించుకొంటివి గదయ్యా ముక్తి బ్రహ్మర్షివై. 118

కం. ధన్యుండవు లోకత్రయ
మాన్యుండ వపారయోగమహిముఁడవు నసా
మాన్యుండ వనుత్తమతమ
సన్న్యాసివి నీకు నీవ సాటి తలంపన్. 119

చ. మనమున వేఱుగాఁ దలఁప మానుదు వేని త్వదీయయోగసం
జనితమహానుభూతి వినఁ జాలఁగ నెమ్మది నుత్సహింతు" నం
చనఁగ నరుంధతీధవునియాలపనంబుల నాలకించి యా
వినమితుఁ డౌచుఁ గౌశికుఁడు విన్నపముం బొనరించె నీక్రియన్.

ఉ. మౌనివరేణ్య! ధన్యుఁడను మామకకష్టసమార్జితాత్మవి
జ్ఞానసువర్ణమున్ వెలికిఁ జక్కఁగఁ దీసి యిదే భవన్మనీ
షానికషోపలంబుపయి సారెకు గీచి ప్రశస్తమైనచోఁ
బూనెదఁ గానిచో విడిచి పుచ్చెద నంచు వచించి వెండియున్. 121

రజ్జువునందు సర్పం బట్టు లీవిశ్వ
మాత్మనే తోఁచు మాయ, నని యనుచు
మాయ నాఁ దా లేనిదే యెన్నఁ డన, లేని
దేరీతి విరచించు సృష్టి ననుచు
నందుచే దేహత్రయంబు మిథ్య యఁటంచు
నాత్మ నో నేన సత్యం బఁటంచు
గుణరూపరహితునకుఁ నాకు మృతిజన్మ
కర్మాదికం బెట్లు కల్గు ననుచుఁ

తే. గీ. కర్తగాఁ దోఁచినను నే నకర్త ననుచు
బంధమోక్షంబులే యసంభవము లనుచు
నాదిమధ్యాంతరహితుండ ననుచుఁ దత్వ
మెల్లఁ గనుఁగొంటి సాకల్యతృప్తిఁ గంటి. 122

తే. గీ. చేసియును చేయనట్టి వాచించి పలుక
నట్టి భోగించి భోగింపనట్టి చంపి
చంపనట్టి నిగూఢతాసరణి నరసి
యద్వితీయుఁడ నైతి మహానుభావ ! 123

మత్తకోకిల. లేదు జన్మము లేదు నాశము లేదవిద్యయు విద్యయుఁ
లేదు బంధము లేదు మోక్షము లేదు దేహము కర్మముఁ
లేదు పుణ్యము లేదు పాపము లేదు విశ్వము చెప్పఁగా
నేది సాధ్యము కాదొ యయ్యదియే యెసంగు నఖండ మై.

మ. అని యిట్లంబుదధీరరావమున వ్యాహరింప గాధేయునిం
బున రాలింగన మాచరించె; మయికమ్మల్ గమ్మిరింపంగ నా
తనివామాంసముపైఁ గపోలమును సంస్థాపించె; నానందసం
జనితాస్రుల్ విడిచెఁ వసిష్ఠముని పంచారింపఁగా గద్గుదుల్. 125

ఆ. వె. పరిమళమ్ము దిశలఁ బ్రాఁక నాకావళి
కురిసెఁ బారిజాతకుసుమవృష్టి
వారిపై విధాతృవాసవాశీర్వాద
పూర్వకమ్ముగా నపూర్వలీల. 126

మ. భగవానుం డగుగాధినందనుఁడు తా బ్రహ్మర్షి యై పొల్చె నీ
జగదారాధ్యు నపారసత్కరుణచే సౌఖ్యమ్ము సేకూఱుఁ బ
న్నగమర్త్యామరలోకపాళి కనుచుం బల్కెన్ వసిష్ఠుండు త
ద్దిగధీశుల్ విధియుం "దథా" స్తనుచు వే దీవించి రుచ్చైస్తుతిన్. 127

చ. శిరము రవంత వంచుకొని చేదొవలఁ ముకుళీకరించి సు
స్థిరగతి నిల్చెఁ గౌశికుఁ డతీతముదాభరితాంతరంగుఁ డై
విరులసరుల్ గళంబున స్రవించుచు నైచి క్రమక్రమంబుగా
నరిగిరి నైజలోకముల కంబుజసంభవుఁడున్ దిశాపతుల్. 128

కం. తనయాశ్రమంబునకుఁ దో
డ్కొని చనియె వసిష్ఠుఁడాని కుశికతనూజున్
ఘనతమగతి నాతిథ్యం
బొనరించుటపొంకు దశరథోర్వీశసుతా ! 129

తే. గీ. అట్టి బ్రహ్మర్షి యట్టి మహానుభావుఁ
డీకుశికనందనుం డిట కేగుదెంచె
దాశరథిరత్నములతోడ దయ దలిర్ప
మన్నృపాగణ్యపుణ్యసంపదలవలన. 130

మ. అని గాధేయునివంకఁ గన్గొని "మహాత్మా ! మత్కథాభాగమం
దున లోపంబులు పెక్కు లుండు ననుకొందున్ దిద్దుకో నెంతు మ
న్నన మీఱంగను నాన తిం" డని శతానందుం డనం గౌశికుం
డనియెన్ "గౌతమసూతినోట నన్నృతంబా ?" యంచు లేనవ్వుతోన్.

కం. మిత్రకులీనులు దశరథ
పుత్రులు గౌతమసుతోక్తమును మునివిశ్వా
మిత్రపవిత్రవిచిత్రచ
రిత్రము విని మునుకవెట్టిరి ముదంబోధిన్. 232

చ. విదితకలాకలాపు లురువిశ్రుతసద్యశు లాత్మతత్వకో
విదులు విధూతపాపులుఁ గవిత్వరసజ్ఞు లనామయాయురా
స్పదులు ధనాఢ్యు లాత్మకులవర్ధను లౌట ధ్రువంబు కౌశికా
భ్యుదయకృతిం బఠించిన సమున్నతి విన్నను శ్రద్ధధాను లై. 133

చంద్రవర్త్మవృత్తము. కృష్ణమూర్తిసుకవీంద్ర! సుకవితా
జిష్ణుధీవిభవ! శ్రీపదకుల! వ
ర్ధిష్ణుకీర్తిపరిదీప్తదశదిశా!
జిష్ణువైభవసుసేవితచరణా! 134

గద్యము.

ఇది శ్రీహరిహరదేవద యాపాంగప్రసారణసమాసాదితోభయభాషాకవితా
రచనాప్రవీణ, [illegible]పర్యుపనామకకాశ్యపసగోత్రపవిత్ర, బాప
నార్యభిషక్సార్వభౌమపౌత్ర, వేంకమాంబావేంకటరాయ
సుధీపుణ్యోదం[illegible]తతనూజ, కవికంఠీరవ, కవిమూర్ధన్య
మహాబిరుదవిరాజమాన, కృష్ణశాస్త్రిప్రణీతం బైన
కౌశికాభ్యుదయమహాప్రబంధంబునందుఁ
బంచమాశ్వాసము
సర్వము సంపూర్ణము.

